సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 29
20-3-57

దుర్ముఖ ఫాల్గుణ బహుళ పంచమి బుధవారం






## విషయానుక్రమణిక



ముఖచిత్రం :
కృష్ణకుమారి

# ఘనావతరణం

ఆక్రా నగర వీధులలో ఈ నెల 6 తేదీన స్వాతంత్ర్య కోలాహలం చెలరేగింది. రాత్రి పన్నెండు గంటలు మ్రోగుతుండగానే పార్లమెంటు భవనం మీద బ్రిటిష్ పతాకం దిగిపోయి, మూడు రంగుల కొత్త జెండా రెపరెపలాడుతూ ఎగిరింది. ఘనా ప్రధాని డా॥ క్వామే ఎన్‌క్రుమాను ప్రజా ప్రతినిధులు భుజాలపై ఎక్కించుకుని వీధుల్లోకి తీసుకువచ్చారు. ఉత్సాహం పట్టలేని జనసమూహం జయజయ నినాదాలు, నృత్యాలు చేస్తూ బజార్లంతటా కిక్కిరిసిపోయారు. బాణసంచా వెలుగులతో చీకటి పటాపంచలై పోయింది.

నూరేళ్ళకుపైగా పరాధీనంగా ఉన్న గోల్డ్‌కోస్ట్ మార్చి 6వ తేదీన స్వాతంత్ర్యం పొందింది. కాని ఐచ్ఛికంగానే కామన్వెల్తులో సభ్యదేశంగా ఉండి పోదలుచుకుంది. "మొన్నటిదాకా మాపై పెత్తనం చెలాయించిన బ్రిటనునుండి స్నేహపూర్వకంగానే విడిపోతున్నాము... ద్వేషమేమీ లేదు... కామన్వెల్తుతో అనుబంధాన్ని మేము గౌరవిస్తున్నాము. ఈ అనుబంధం వలన కామన్వెల్తులో చేరిన ఆసియా రాజ్యాలతో మాకు బాంధవ్యం ఏర్పడుతుంది. ఆదేశాల సమస్యలు మాసమస్యలు ఒకటే మాదిరివి. అందుచేత ఆబాంధవ్యం మాకు అమూల్యమైనది," అని ఘనా ప్రధాని డా॥ ఎన్‌క్రుమా స్పష్టంచేశారు.

ఘనా విదేశాంగనీతిని వివరిస్తూ తాము ఏ కూటానికీ చెందకుండా అన్ని దేశాలతోనూ సమాన స్నేహంతో ప్రవర్తిస్తామని ఎన్‌క్రుమా వెల్లడించారు.

ఘనా విదేశాంగ విధానానికి ఆదర్శం భారత విదేశాంగనీతేనని వేరే చెప్పనక్కర్లేదు. ఒక్క విదేశాంగనీతిలోనే కాదు, ఇంకా అనేక విషయాలలో భారతదేశానికీ, ఘనాదేశానికీ పోలికలున్నాయి.

## ప్రిజన్ గ్రాడ్యుయేట్

ఆసియాలో పరాయి పరిపాలన క్రింద ఉన్న దేశాలన్నిటికీ భారతదేశం మార్గదర్శకమైనట్టే, ఆఫ్రికాలోని పీడిత జాతులన్నిటికీ ఘనా మార్గదర్శకమైంది. అసలు ఘనా స్వాతంత్ర్యోద్యమానికి ఆదర్శం భారత స్వాతంత్ర్యోద్యమమే. మహాత్మాగాంధీ, నెహ్రూల వరవడిలో ఘనా ప్రజానాయకుల ఆందోళన నడిచింది. డా॥ ఎన్‌క్రుమాకు నెహ్రూపై ఉన్న గౌరవం అపారం. ఎన్‌క్రుమాను "గోల్డ్‌కోస్ట్ నెహ్రూ" అని అనడంకూడా పరిపాటి. మన దేశంలో నెహ్రూకు ప్రజలలో ఎంత పలుకుబడి ఉందో అంత పలుకుబడి 'కన్వెన్షన్ పీపుల్స్ పార్టీ' నాయకుడైన ఎన్‌క్రుమాకు ఉంది. ఎన్‌క్రుమా, ఆయన సహచరులు నెహ్రూటోపీ వంటి టోపీ ధరిస్తారు. దానిపై "పి. జి." అనే ఇంగ్లీషు అక్షరాలు



"గోల్డ్‌కోస్ట్ నెహ్రూ"
డా॥ ఎన్‌క్రుమా

ఉంటాయి. పి. జి. అంటే 'ప్రిజన్ గ్రాడ్యుయేట్' [జైలు శిక్ష అనుభవించినవాడు] అని అర్థం. నెహ్రూ లాగానే ఎన్‌క్రుమా కూడా సోషలిస్టు. అయితే తాను మార్క్సియన్ సోషలిస్టునని ఎన్‌క్రుమా చెప్పుకుంటారు. చిన్నతనంలోనే ఆయన నెహ్రూవలెనే విదేశాలకువెళ్ళి విద్య అభ్యసించారు. మొదట అమెరికాలోని లింకన్ విశ్వవిద్యాలయంలో చేరి చదివి నాలుగు డిగ్రీలు సంపాదించారు. అక్కడ ఎనిమిదేళ్లుండి, తరవాత లండన్ విశ్వవిద్యాలయంలో చేరి 'లా' పరీక్షకు చదివారు. ఆ రోజుల్లోనే ఆయనదృష్టి రాజకీయాలవైపు మళ్లింది.

## సామ్రాజ్యవాద విరోధి

"పీడిత ప్రజానీకమా! మేలుకో!" అని ఆయన స్వదేశీయులను, ఇతర వలసదేశ ప్రజలను ప్రబోధించారు. ఆ రోజుల్లోనే ఆయన దృష్టి మార్క్సిజమ్‌పై కూ మళ్ళింది. స్వదేశంలో విజృంభిస్తున్న జాతీయోద్యమం తాలూకు నాయకులు ఆయనను వచ్చి నాయకత్వం వహించవలసిందిగా ఆహ్వానించారు. 1947 డిసెంబరులో 12 ఏళ్ళ విదేశ నివాసం తరవాత ఎన్‌క్రుమా గోల్డ్‌కోస్టుకు తిరిగి వచ్చారు. యునైటెడ్ గోల్డ్‌కోస్ట్ కన్వెన్షనుకు ఆయన కార్యదర్శి అయ్యారు. స్వపరిపాలన కావాలని 1948 ఫిబ్రవరిలో జరిగిన దేశవ్యాప్త ఆందోళన ఫలితంగా ఎన్‌క్రుమా, మరొక అగ్రనాయకుడు జేమ్స్ బి. డాంకా అరెస్టయ్యారు. 1949 లో ఎన్‌క్రుమా విడుదల అయి, డాంకా నాయకత్వాన నడుస్తున్న గోల్డ్‌కోస్ట్ కన్వెన్షన్ విధానాలు నచ్చక, మరొక పార్టీని స్థాపించారు. దీనిపేరు కన్వెన్షన్ పీపుల్స్ పార్టీ. [ఇదే ఇప్పుడు అధికారంలో ఉన్న పార్టీ] ఈ పార్టీ త్వరలో ప్రజలలో అపారమైన పలుకుబడి సంపాదించింది. 1950 లో బ్రిటిష్ ప్రభుత్వం మళ్ళీ ఎన్‌క్రుమాను అరెస్టుచేసింది. దీనితో ఆయన జాతికి ఏకైక నాయకుడయ్యారు. ఆయన జైలులో ఉండగానే ప్రభుత్వం ఎన్నికలు జరిపింది. ఆ ఎన్నికల్లో ఎన్‌క్రుమాపార్టీకి నూటికి ఎనభై వంతుల ఓట్లు లభించాయి. ఎన్‌క్రుమాను జైలునుంచి విడుదలచేశారు. "నేను బ్రిటన్‌కు మిత్రుణ్ని. కాని సామ్రాజ్యవాదానికి బద్ధవిరోధిని" అని ఆయన జైలునుంచి వస్తూనే ప్రకటించారు. ప్రజాప్రతినిధులు ఆయనను ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నారు. 1951 నుంచి ఈనాటికీ ఆయనే గోల్డ్‌కోస్టుకు ప్రధాన మంత్రి

## ఘనతకెక్కిన ఘనా

మొదట్లో వర్తకం కోసం వచ్చిన పోర్చుగీసుల కళ్ళు ఆ దేశంలో దొరికే బంగారం మీద పడ్డాయి. ఆ దేశానికి అందుకే 'గోల్డ్

# ★ ఘనా వతరణం ★

కోస్టు [స్వర్ణతీరం] అని పేరుపెట్టారు. కాని ఆ దేశీయులు మార్చి 6 వ తేదీనుంచీ ఆపేరు మార్చి 'ఘనా' అనే కొత్తపేరు పెట్టుకున్నారు. నిజానికిది కొత్తపేరు కాదు, పాతదే. సుమారు ఏడువందల ఏళ్లకిందట ఆఫ్రికాలో ఒక వెలుగు వెలిగి ఆరిపోయిన 'ఘనా' సామ్రాజ్యానికి చెందినవారమని గోల్డ్ కోస్టు వాసుల భావం. అందుచేత తిరిగి 'ఘనా' అనే పేరే తమదేశానికి పెట్టుకున్నారు.

మార్చి 6 వ తేదీన భారత ప్రధాని ఘనా దేశానికి శుభాకాంక్షలను ప్రకటించారు. ఆఫ్రికా ఖండం అందరూ అనుకుంటున్నట్లు చీకటి ఖండం కాదనీ, ప్రాచీనకాలంలో గొప్ప చరిత్ర, సంస్కృతి, రాజకీయవ్యవస్థ, ప్రజాస్వామ్యం, సామ్యవాదం కూడా కలిగిన ఖండమని ఆ సందర్భంలో ప్రధాని నెహ్రూ వర్ణించారు. 14 వ శతాబ్దంలో మహమ్మద్ బిన్ తుగ్లక్ పరిపాలన కాలంలో భారతదేశానికి వచ్చిన విదేశీ యాత్రికుడు ఇబిన్ బటూటా ఆఫ్రికా ఖండపు పశ్చిమతీరంనుంచి వచ్చినవాడేనని, అతడు భారత దేశాన్ని గూర్చి చాలా అమూల్య విషయాలు వ్రాసిన చరిత్రకారుడనీ ఆయన అన్నారు.

## "నల్లగుంటేనేమిరా"

ఒకప్పుడు ఆ ప్రాంతం ఉచ్చస్థితిలో ఉన్నా, ఇటీవలి కాలంలో పాశ్చాత్యుల వలస పరిపాలన ఫలితంగా చితికిపోయినమాట నిజం. ఈనాడు ఆఫ్రికా ఖండంలో అనేక భాగాలు మిగతా ప్రపంచంకంటే బాగా వెనకబడి ఉన్నాయి. ఆయా భాగాలపై పశుబలంతో ఆధిపత్యం నెరపుతున్న శ్వేత జాతులవారు నీగ్రోలను అధమజాతిగా పరిగణించి, పైకి రానీయక అణగద్రొక్కుతున్నారు. ఒక్క దక్షిణాఫ్రికాలోనే కాక ఇతరఆఫ్రికన్‌భాగాల్లోకూడా శ్వేతదౌర్జన్యం ప్రబలంగాఉంది. కాని నీగ్రోలలో స్వాతంత్ర్యేచ్ఛ అంత ప్రబలంగానూ ప్రజ్వరిల్లుతోంది. ఘనాదేశంలో ఉదయించిన స్వాతంత్ర్యభానుకిరణాలు ఇతర చీకటి ప్రాంతాలపై కూడా ప్రసరిస్తున్నాయి. ఆ ప్రాంతాల్లోని నీగ్రో జాతులవారు జాగృతులవుతున్నారు. తాము యూరపియన్లలాగా తెల్లగా లేనందుకు, నల్లగా ఉన్నందుకు గర్వపడుతున్నారు. ఘనాదేశం మాదిరిగా తాముకూడా స్వాతంత్ర్యం సంపాదించుకోవడానికి పోరాటం సాగిస్తున్నారు. "వలస దేశాలన్నిటికీ మా ఉదాహరణ ఆదర్శం కాగలదని నమ్ముతున్నాను" అని డా॥ ఎన్‌క్రుమా మొన్న 6 వ తేదీన ప్రకటించారు. ఇది అక్షరాలా నిజం కాగలదు.

గోల్డ్ కోస్టుకు స్వాతంత్ర్యం ఇచ్చి, ఆ దేశీయుల స్నేహం సంపాదించుకోవడంలో బ్రిటిష్ టోరీ ప్రభుత్వం గొప్ప రాజకీయ నీతిని చూపింది. అదే రాజకీయ నీతిని ఇంకా ఇతర వలస ప్రాంతాల్లో బ్రిటన్, ఫ్రాన్సు, పోర్చుగల్ మొదలైన సామ్రాజ్యవాదదేశాలు అనుసరించి వలస విధానాన్ని విసర్జించగలిగితే లోకకల్యాణానికి ద్రోహం కాక, దోహదం చేసిన వవుతాయి. ★



# నేను ఫేక్టరీ కార్మికుడను...

## నేను భీమా లేకుండా ఉండలేను.

"అయిదు ఏళ్ల క్రిందట, ఒక యువకుడు పట్టణంలో జీవనోపాధి యేర్పర్చు కొనుటకు తన స్వగ్రామము విడచి వెళ్లెను. అతడు వేలాది ఇతరుల వంటి వాడు—కాని ధన్యుడు. అతనికి పని దొరికింది, దాని యందు చాలా కష్టించి పని చేశాడు. ఆ యువకుడను నేనే.

"గత అయిదు సంవత్సరములున్ను బాగా గడిచాయి, నేను నా పనిలో వృద్ధి బొంది ఇప్పుడు ఒక బాధ్యతాయుత పనిలో నున్నాను. విషయములన్నీ నా పట్ల అనుకూలంగానే నడుచు చున్నవి. ఇప్పుడు వివాహితుడనై, ఇద్దరు పుత్రులను గలిగి యుండియు, ఇంటికి నా తండ్రి నిమిత్తం సొమ్ము పంపుచూ యుండగలుగుచున్నాను.

"కాని ప్రపంచంలో జన్మించి నందున, జీవితం అనిత్యం అని నేనెరుగుదును. అందుచేత నాకున్ను నా కుటుంబమునకున్ను జీవిత భీమా మూలకంగా రక్షణను యేర్పర్చు కొన్నాను. నిజంగా, నేను భీమా లేకుండా ఉండ లేను—చాలా మంది జీవనానికి నావైన ఆధార పడి యున్నారు.

"నేను నా ప్రీమియములను ఎట్లు చెల్లింప గలుగు చున్నాను? సరె, సాధ్యమైనంత వరకు, ఫేక్టరీ వారు నాకు ఇచ్చుచున్నట్టి బోనను సొమ్ములనుంచి నేను సాలీనా ప్రీమియములను చెల్లించు చున్నాను. ఈ విధంగా తగినంత మొత్తమునకు నేను భీమా చేశాను అయినప్పటికీ నాకేమీ చిక్కు లేదు.

"భీమా యందు నాకు నమ్మిక యున్నది."



లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

సెంట్రల్ ఆఫీసు:–ఓరియంటల్ బిల్డింగ్స్, ఫోర్ట్, బొంబాయి 1.

**Life Insurance Corporation of India**

ASP/LIC-7

దక్షిణ ప్రాంత కార్యాలయము: యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్, పి. ఓ. బాక్సు నెం. 281. మద్రాసు-1.

ఆంధ్రప్రదేశ్ డివిజనల్ ఆఫీసులు: మచిలీపట్నం, హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ యందంతటా బ్రాంచి ఆఫీసులు గలవు.

# బుడుగు

## బొజ్జుల పిడుగు





వంటింటిలో వందరూపాయల నోటూ, ఒక మీసాల డిక్కెష్టి వాడూ పోయారా? అసలే మేమందరం హాచ్చెర్యపడి పోయేస్తున్నాం గదా.

అంతట్లోకి ఇంకో డిక్కెష్టిలాంటి పెద్దవాడుగారిగా నవేస్తూ యిలా వంగిపోయి పరిగెత్తుకుని వచ్చేశాడు లోపలికి. అప్పుడు మేం ఇంకా బోల్డు హాచ్చెర్యపడిపోయాం.

ఇదేమిటే ఇంకో డిక్కెష్టి వచ్చింది అంది బామ్మ.

అప్పుడు ఆ లావుపాటి వాడు బామ్మకి దండం పెట్టేశాడు.

బామ్మగారూ మరేమో నూ నేనేమో డిక్కెష్టి వాడినికానూ అని చెప్పాను. ఇంకా నేతోనూ, నేను ఎలక్షనుకి వచ్చాను. ఓటు కావాలి అన్నాడు.

ఎలక్షను అంటే మంత్రిఅవడం. ఇలాగని బాబాయి చెప్పాడు. దాని కోసం మనఓటు ఇయ్యాలిట. ఓటు అంటే నాకు తెలీదు.

ఏం అప్పుడు బామ్మకి కోపం వచ్చేసింది. వుండవయ్యా, డిక్కెష్టి వాడు కనబడలేదూ, అసలే మేం హాశ్చెరంగా ఉంటేనూ నూ, అలాని అంది.



అప్పుడు నాన ఇంగిలీషులో ఎలక్షనువాడితో ఏదో చెప్పాడు.

వాడేమో హాయింతేనా అని గాఠిగా నవేశాడు. డిక్కెష్టి అంటే ఆమీసాలవాడేనా అని అడిగాడు.

నిజెం మీసాలు కావులెండి. డిక్కెష్టింగు మీసాలు అని చెప్పాడు బాబాయి.

వాడు నాకు తెలుసులెండి అన్నాడు ఎలక్షనువాడు. అని, మళ్ళీనేమో నాన్నని దగ్గిరికి పిలిచాడు.

పిలిచి, ఈడిక్కెష్టి వాడు మీకు ఛాలా బాకీ వున్నాడా అన్నాడు. అప్పుడేమో లావుపాటి పక్కింటి పిన్నిగారి మొగుడేమో నాకు బాకీ అండీ అని చెప్పాడు.

హోహో అన్నాడు ఎలక్షనువాడు.

హో హో అని బాబాయిగారా అన్నాడు.

తరవాత ఎలక్షనువాడెవరో యిలా కళ్ళుమూసుకుని వురేయి! డికెష్టివుడూ డికెష్టివుడూ పిన్నిగారి ముగుడు ఏం అనడులే, నేను పది రూపాయలు నీకిస్తానులేదామ్మోదా, దామ్మోదా అని అరిచాడు.

నిజంగానే? అని ఎవరో అన్నారు. కాని కనబడలేదు.

నిజంగానే ఒరు అన్నాడు ఎలక్షను వాడు.

అప్పుడేమో, డికెష్టివాడు దభీమని కిందపడ్డాడు అటకమీంచి.

హారినీ అన్నాడు బాబాయి హాచెర్యపడి. అందరూ నవ్వేశారు.

అప్పుడేమో ఎలక్షనువాడు ఓటు నావోటు వోటు అన్నాడు.

నువ్వు మంతిరివి అయితే మాయింటికీ పక్కింటి పిన్నిగారింటికీ వెల్ల వేస్తావా అని అడిగింది బామ్మ.

ఓ అన్నాడు ఓట్లువాడు.

మళ్ళీనేమో అల్లా ఎదురింటికి వెల్ల వెయ్యకూడదు మరి అంది బామ్మ.

ఓ అన్నాడు ఓట్లువాడు.

మరి నన్ను జెటకా తోలనిస్తావా అని అడిగాను నేను.

ఓ మీనాన నాకు ఓటిస్తే తప్పకుండా అన్నాడు ఓట్లవాడు.

హోహో మీఓటు నాకే అన్నాడు ఓట్లువాడు మళ్ళీ.

నాకు డికెష్టింగు కేసులు ఇస్తారండీ అన్నాడు డికెష్టివాడు.

నాకు ఓటిస్తే బోల్డు కేసులు అని చెప్పాడు ఓట్లువాడు.

ఇంతల్లోకే యెవరో రెండుజెడల సీత వచ్చింది.

యేవండీ అని పిలిచింది వీదిలోంచి.

బాబాయి ఒక్కసారి ఓయ్ అనేసి పరిగెత్తాడు. అప్పుడు నేనూ వెళ్ళాను.

ఆ సీత ఇంచక్కా ఉందిలే. మీ ఓటు మాకు ఇస్తారుగదండీ అంది ఆ సీత.

వ్వో ..నా ఓటు, మా అమ్మ ఓటూ, అన్నదీ, వదినది, పక్కింటివాళ్ళది, ఈ ఊరి వాళ్ళ ఓటులు అన్నీ మీకే ఇచ్చేస్తాను అన్నాడు బాబాయి యిలా దానుసు చేసేసి, కాళ్ళూ చేతులూ ముడివేసేసుకుని.

అప్పుడు నేను కూడా ఓటిస్తాను







# బుడుగు! చిచ్చుల పిడుగు!

అన్నాను. అప్పుడు సీత సరేనని, యిలా కంగి సున్న కుంచెం ముద్దుపెట్టుకుంది.

నా ఓటుకూడా తీసుకోండి అన్నాడు బాబాయి.

సరే అండి అని నవ్వేసి వెళిపోయింది సీత.

యేం. ఓటు అంటే ముద్దు అని అర్థమా బాబాయి అని అడిగానా.

అంతట్లోకి యింకో పేద్ద మీసాలవాడు ఘుభఘుబా పరిగెతుకు వచ్చేశాడు. నన్ను ఇలా ఎత్తుకునేసి, బోల్టు ముద్దులు పెట్టేసనేసి మీ ఓట్లు మాకే అని బాబాయికి చెప్పిమళ్లీ పరిగెరుకెళిపోయాడు.

ఓటు అంటే ముద్దుకాదురా బుడుగూ అని చెప్పాడు బాబాయి అపుడు.

యేం. అపుడు మాయింటిలోపల ఉన్న ఎలక్షనువాడు వచ్చి, మీ వోటు మాకే అని మళ్ళీచెప్పేసి వెళ్ళిపోయాడు.

హామ్మయ్య అన్నాడు నాన్న.

వంద రూపాయలూ పోయాయిగదా అంది అమ్మ.

ఈ ఓట్లువాడిని వెతికిపెట్టమంటే సరిఅంది బామ్మ.

అబ్బే వద్దండి నేనే డికెక్టింగు చేసేస్తాను. ఒక్క సెవంకూడా లేదూ, ఉటేం ఇందాకళే డికెక్టు చేద్దునూ అన్నాడు.




నానా వాళ్లూ కోపంగా వెళిపోయారు లోపలికి.

ఎలాగరా అన్నాడు బాబాయి.

అప్పుడేమో డికెక్టివాడు నన్ను పిలిచి, బుడుగూ బుడుగూ నీదగ్గిర పాత జెటకా బీడీలు వుంటే ఒక్కటి యియ్యి చెప్తాను అన్నాడు.

నాకు జాలేసింది. సరే ఒక్కటే ఇస్తాను అని చెప్పా.

వాడూ నాతో వచ్చాడు యిలా అద్దంలోంచి చూస్తూ.

నేను నాసందుగా పెట్టితీసి, అందులో బామ్మవత్తులుపెట్టె తీసి, కుంచెం దూది ఉంటేఅదికూడాతీసి, బీడీకోసం చూశానా!

దొరికింది అనేసి డికెక్టివాడు గాఠిగా అరిచేశాడు.

నేను హడ్డిలి పోయానుతే.

అమ్మ, నానా, బాబాయి, బామ్మ అంధరూ వచ్చేశారు యేవిటీ యేమిటి అంటూ.

ఇగ్గో వంటింటో వందరూపాయల కేసు మీ బుడుగు వత్తులపెట్టిలో ఉంది. అన్నాడు డికెక్టివాడు.

అది నా వత్తులపెట్టి అంది బామ్మ.

కాదూ, నేను గోళీకాయలు దాచుకున్నాను. నాదీ అని చెప్పేశాను నేను.

కాని అందులో బామ వంటింట్లో వంద రూపాయల కేసు దాచిందని నాకేం తెలుసు. వృత్తిసే వత్తులు పెత్తుకుంది అనుకున్నాను.

వీడే హంతకుడు అన్నాడు డికెక్టివాడు అప్పుడు. యెంత హాశ్చెర్యం నాకు!

(యెంతో రేపో మూడ్రోలుకో చెప్తాతే.)



# మంత్రాలు : నమ్మకాలు

## జలార్గళం - జ్యోతిశ్శాస్త్రం

నేనక్కడికి వెళ్లేసరికి ఒక సంపన్న గృహస్థు సావిట్లో మా పోడూరు గ్రామస్థులంతా గుంపులు గుంపులుగా గుమిగూడి ఉన్నారు. మధ్యన ఒకాయన కూర్చుని అడిగే వారి ప్రశ్నలన్నిటికీ ఏవేవో సమాధానాలిస్తున్నారు. నేనా వ్యక్తికి కొంచెం దగ్గరగా జరిగి ఆ జ్యోతిశ్శాస్త్రజ్ఞులెవరని నా ప్రక్కనే కూర్చున్న ఒక ఆసామీని అడిగాను.

"ఆయనెవరో ఎరగరా? ఆయనే కవికొండల నారాయణమూర్తిగారు. ఇప్పుడే అనకాపల్లినించి ఈ గ్రామం వచ్చారు"

అని రహస్యంగా ఆయన్ని గురించిన కొన్ని విశేషాలు నా చెవిలో ఊదాడు. నేను విస్తుపోయి ఆయనకేసి చూస్తూ కూర్చున్నాను. అప్పటికి సుమారు 10 గంటలయింది. అంతలో ఒక మోతుబరి రైతు లేచి నిలబడ్డాడు :

"బాబూ! నేనింకా భోజనమైనా చెయ్యలేదు! కాస్త ముందు నా ప్రశ్నలకి సమాధానాలు చెప్పండి. తొందరగా వెళ్లాలి" అన్నాడెంతో ఆత్రంగా.

కవికొండల నారాయణమూర్తిగారా వ్యక్తివైపొకనిమిషం చూశారు :

"అదేమిటండీ! వంకాయ వేపుడు వేసుకుని కుషీగా భోజనం చేసివచ్చి భోజనం చెయ్యలేదని అబద్ధాలాడతారు!" అన్నారు.

ఆ మాటతో నిలబడ్డ మోతుబరి రైతు నిలువునా నిర్ఘాంతపోయాడు తానన్నమాట అబద్ధమే అని అంగీకరించాడు. ఏదో పని తొందరవల్ల అలాగ మాట్లాడవలసి వచ్చిందని నారాయణమూర్తిగారిని బతిమాలుకొన్నాడు.

కవికొండలవారంతకుపూర్వం ఆ గ్రామానికి ఎప్పుడు రాలేదు ఆవేళ ఉదయమే వారా గ్రామానికి వచ్చారు. పైగా అక్కడ ఉన్న ఆసాములంతా ఆయనకి బాగా కొత్త ఎక్కడో అనకాపల్లిలో బయలుదేరి వచ్చిన వారికి పశ్చిమగోదావరిజిల్లాలో ఒక గ్రామంలో ఉన్న ఒకానొక మోతుబరి రైతు అప్పుడే వంకాయ వేపుడుకూరతో భోజనం చేసి వచ్చాడని ఎలాగ తెలిసింది! ఆయన చెప్పిన సమాధానంతో ఆ మోతుబరి రైతే కాక అక్కడ కూర్చున్నవారంతా ఆశ్చర్యపోయారు.

ఆపైన ఇంకొక విచిత్రం జరిగింది. కొంతసేకటికి ఆ రైతాయన్ని ఇంకొక ప్రశ్న అడిగాడు :

"బాబూ! మా తోటలో నీటికి చాలా ఇబ్బంది పడుతున్నాము. కాస్త మా తోటకి వచ్చి ఎక్కడ తవ్వితే మంచినీరు పడుతుందో చెప్పండి!"

కవికొండల వారొకక్షణంసేపు రెండు వేళ్లతోను గబగబా నేలమీద తాటించారు. ప్రశ్నలకు సమాధానాలు చెప్పేటప్పుడలాగ వేళ్ళు నేలమీద తాటించడం ఆయనకొక అలవాటు.

"మీ తోటలో ఒక వేపచెట్టుందికాదూ?" మోతుబరి రైతు తోటలోకి వచ్చిన తరవాతే ఆయన ఏదో సలహా ఇస్తాడని అనుకొన్నాడు. హఠాత్తుగా ఇలాగడగడంతో మరింత ఆశ్చర్యపోయాడు :

"లేదు బాబూ!"

"ఉంటుంది చూడండి!"

"మా తోటసంగతి నాకు తెలియదా బాబూ! ఎక్కడా వేపచెట్టులేదే!"

"ఒక్క చిన్న మొక్కైనా ఉండి తీరుతుంది మధ్యాహ్నం మీ తోట అంతా కొంచెం పరకాయించి చూడండి!"

ఆ మోతుబరి ఆవేళ మధ్యాహ్నం తోట అంతా వెతికాడు. మళ్ళీ సాయంత్రం తిరిగి వచ్చాడు. తోటలో ఒకమూల కొంచెం పెద్ద వేపమొక్క కనిపించిందని చెప్పాడు. చుట్టూరా కూర్చున్న మేమంతా మళ్ళీ నిర్ఘాంతపోయాము.

కవికొండలవారు మళ్ళీ వేళ్ళు తాటించారు:

"ఆ వేపమొక్కకి తూర్పుగా గజందూరంలో

# జలార్గళం: జ్యోతిశ్శాస్త్రం

తవ్వితే గంగాబొండాలలాంటి మంచినీళ్ళు పడతాయి. వెంటనే తవ్వుపని ప్రారంభించండి!"

నారాయణమూర్తిగారు ఆ వేళ మధ్యాహ్నమే మా ఊరినించి వెళ్ళిపోయారు. మోతుబరి రైతు ఆయన చెప్పినచోటే నుయ్యి తవ్వించాడు. నిజంగా గంగా బొండాల వంటి మంచినీళ్ళే పడ్డాయి!

కవికొండలవారు చెప్పిన ఇలాంటివే మరి కొన్ని సలహాలు తు, చ తప్పకుండా దాఖలాలిచ్చాయని ఆతరవాత నాకు తెలిసింది. నాటికీ నేటికీ మాఊళ్ళో ఈ కథలు చాలా విడ్డూరంగా చెప్పుకుంటారు.

జలార్గళ శాస్త్రాన్ని బట్టి నీళ్లు పడేదీ లేనిదీ చెప్పేవారు మనదేశంలో చాలామందే ఉన్నారు. అయితే ఆ మోతుబరి రైతు తోటవైపైనా చూడకుండా కవికొండలవారు ఆ తోటలో వేపమొక్క ఉన్నవైనం ఎలా కనిపెట్టారు! ఆ ప్రాంతంలో నీళ్లు పడే వైనం ఆయనకెలాగ తెలిసింది?

ఆయన ఏదైనా జాతకచక్రాలు, చేతులు చూచి ఫలితాలు చెప్పారాఅంటే అదీలేదు. ఊరికే నేలమీద రెండు వేళ్లు తాటిస్తూ అడిగినవారి ప్రశ్నల కన్నిటికీ శరపరంపరగా సమాధానాలు చెప్పారు. అంతే!

కొందరాయనకేదో మంత్రోపదేశం ఉన్నదనీ అందుచేతనే ఆయన అంత అత్యద్భుతంగా కనీ వినీ ఎరగనివాటినిగురించి సమాధానాలు చెబుతున్నారనీ అన్నారు. బహుశః అది నిజమేమో!

నాకళ్ల ఎదటే జరక్కపోతే ఇదంతా నిజమని నేను నమ్మేవాణ్ణిగాను. బహుశః చాలామందికిది ఇప్పటికీ విడ్డూరంగానే కనిపించవచ్చు. నాకళ్ళ ఎదటే జరిగింది కాబట్టి నాకిదిఅంతా చాలాఅత్యద్భుతంగా కనిపించింది.

ఇలాగ మంత్రశక్తులతో జోస్యాలు చెప్పేవారిని కొంతమందిని నే నెరుగుదును.

కేవలం శాస్త్రీయదృక్పథంతో చూస్తే ఇవన్నీ వట్టి కట్టుకథల్లా కనిపిస్తాయి కాని శాస్త్రీయ పరిశోధన ఇంకా, ఇలాంటి విషయాలు ఇతమిత్థంగా తేల్చి చెప్పదగినంతగా సువిస్తృతం కాలేదు. అందుచేత కేవలం శాస్త్ర దృక్పథంతో పరిశీలించేవారమని అనుకునేవారివన్నీ కట్టుకథలని కొట్టి పారవేయడంకన్న ఇలాంటి విషయాలలో మౌనం అవలంబించి మాట్లాడకూరుకోవడం మంచిది. నిజానికదే సరియైన శాస్త్రీయ దృక్పథం అనిపించుకుంటుంది.

— వినాయక. ★

# న్యూఢిల్లీ లేఖ

## లోక్ సభకు అభ్యర్థుల నియామకం

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

లోక్ సభ ఎన్నికలు బహు మందకొడిగా సాగాయి. న్యూఢిల్లీ నుంచి కాంగ్రెసు అభ్యర్థిని శ్రీమతి సుచేతాకృపలాని గెలిచినా, ఆమె గెలుపోటములపై ప్రజల్లో అమోఘమైన శ్రద్ధ ఏమీ లేదని స్పష్టపడుతూనే ఉంది. న్యూఢిల్లీ నియోజకవర్గంలో 1,92,684 ఓటర్లుండగా 1,04,161 మంది అనగా నూటికి 51.9 వంతులు మాత్రమే ఓటుచేశారు. చాలాకు పోలింగు కేంద్రాలు నిర్జనంగా కనిపించాయి. ఏమిటి దీనికి కారణం? శ్రీమతి సుచేతాకృపలాని బెంగాలీవనిత. ఆమె ఢిల్లీకి చెందిన వ్యక్తి కానేకాదు. అయిదేళ్లకిందట సోషలిస్టు టిక్కెట్టుపై న్యూఢిల్లీలో పోటీచేసి, కాంగ్రెసు అభ్యర్థిని శ్రీమతి మన్‌మోహినీ సైగల్‌ను ఓడించింది. అయిదేళ్ల పార్లమెంటు సభ్యత్వ కాలంలో ఆమె ఢిల్లీనిగూర్చి ఎన్నడూ పెదవి విప్పలేదు. ఇంతలో న్యూఢిల్లీలో సోషలిస్టులకు పరపతి లేదని గ్రహించి కాబోలు ఉన్నట్టుండి కాంగ్రెసులో చేరిందామె. ప్రదేశ్ కాంగ్రెసు సంఘం మొదట్లో ఆమె పేరు ప్రతిపాదించలేదు. ఆమె సరాసరి కాంగ్రెసు అధిష్ఠాన వర్గంతోనే ఒప్పందం కుదుర్చుకుంది. తత్ఫలితంగా ఆమె ఢిల్లీలోనే పోటీచేయడం జరిగింది. [ఆమె రాష్ట్రానికే చెందిన శ్రీ ఎస్. కె. డే కూడా ఢిల్లీనుంచే పోటీచేశారు.] ఇప్పుడు శ్రీమతి సుచేతా మంత్రిఅయ్యే సూచనలుకూడా కనిపిస్తున్నాయి.

రాజకీయపక్షాలు వివిధ నియోజకవర్గాలపై తమ ఇష్టంవచ్చిన అభ్యర్థులను రుద్దడం సబబేనా? ఆ అభ్యర్థులను గెలిపించడంద్వారా తమపై విశ్వాసం ఉందని నిరూపించండని ప్రజలను కోరడం సబబేనా? అభ్యర్థులను నియమించేటప్పుడు వోటర్లతో ఏదోవిధంగా సంప్రదించడం అవసరం కాదా?

### పతిపక్షం, ప్రతిపక్షం

ప్రతిపక్షాన్ని నిర్మించేవిషయమై దేశ మంతటా వివాదాలు చెలరేగాయి. శ్రీ జయప్రకాశ్ నారాయణ, ఆచార్య కృపలానీ, శ్రీ రాజగోపాలాచారి ఈ వివాదాల్లో పాల్గొన్నారు. ప్రతిపక్షం అంటే ఏదో శాసనంచేసి నిర్మించడానికి వీలైన విషయం కాదు. అధికారంలో ఉన్న పార్టీ చేయదగిన విషయం అంతకన్నా కాదు. శ్రమపడి సాధించవలసినదే కాని మాటలతో అయ్యేది కాదు. కాని ప్రతిపక్షం కావాలి కావాలి అని అలజడిచేసే శ్రీ కృపలానీగారి భార్యయే ఇలా అకస్మాత్తుగా పతిపక్షాన్ని వదిలిపెట్టి ప్రతిపక్షమైన కాంగ్రెసులో చేరిపోతే ఇంకా ప్రతిపక్షమేమిటి?



ఈ నెల 8వ తేదీన తమ 68వ ఏట కాలధర్మం చెందిన ప్రఖ్యాత కాంగ్రెసు నాయకుడు శ్రీ బి. జి. ఖేర్ స్వాతంత్ర్య సిద్ధి అనంతరం వీరు బొంబాయిరాష్ట్ర ముఖ్యమంత్రిగా, ఇంగ్లండులో హైకమీషనర్‌గా, గాంధీస్మారకనిధి అధ్యక్షుడుగా, ఇంకా మరెన్నో విధాల దేశసేవచేశారు.

* * *

### వైద్యవిద్యాలయంలో అవకతవకలు

అఖిలభారత వైద్య విద్యాలయం స్థాపించాలని భోర్ సంఘం పదేళ్ళకిందటే సూచించింది. ఉత్తమ శ్రేణికి చెందిన అధ్యాపకులను నియమించి ఉన్నత స్థాయిలో పరిశోధనలు, ప్రయోగాలు సాగించి ఆసియాలోకల్లా అద్వితీయమైన వైద్య విద్యాలయంగా దాన్ని రూపొందించాలని భోర్ సంఘం ప్రతిపాదించింది.

అటువంటి వైద్యవిద్యాలయాన్ని ఎక్కడ స్థాపించాలో నిర్ణయించడానికి లక్ష్మణస్వామి మొదలియార్ అధ్యక్షుడుగా ఒక సంఘాన్ని ఏర్పరచారు. ఆ సంఘంలో సభ్యుడైన డా॥ జీవరాజ్ మెహతా అసలు విద్యాలయమే అక్కర్లేదని వ్యతిరేకించారు. అలా వ్యతిరేకించింది ఆయనొక్కరేఅయినా, ఆయన నివేదికను ప్రభుత్వం మొదట్లో ఆమోదించింది. దరిమిలా విద్యాలయాన్ని స్థాపించడానికే నిర్ణయించారు. ఆ నిర్ణయాన్ని అమలు జరపడానికి శ్రీ కె. సి. కె. ఇ. రాజాను నియమించారు. విద్యాలయ భవనానికి టెండర్లను ఆహ్వానించడంతోనే మొదటి ప్రణాళిక కాలమంతా గడిచిపోయింది. ఈ భవనం ఢిల్లీలోనే ఉంటుంది. స్థలాభావ కారణంచేత భవనం పైకి పెరుగ



# లోక్‌సభకు అభ్యర్థుల నియామకం

తుందట. రోగులను లిఫ్టులలో పైకీ కిందికీ తీసుకు వెడతారట. ఇంకా ఈ భవనం ప్రారంభ దశలోనే ఉందిగాని, అధ్యాపకుల రిక్రూట్‌మెంటు చాలా చురగ్గా జరిగిపోతోంది. దీనికోసం ఒక నియామక సంఘాన్ని ఏర్పాటు చేశారు. అందులో డా॥ లక్ష్మణస్వామి మొదలియార్, కర్నల్ సి. కె. లక్ష్మణ్, డా॥ సి. జి. పండిట్, డా॥ వి. ఆర్. ఖానోల్కర్. డా॥ బి. బి. దీక్షిత్, డా॥ కె. సి. కె. ఇ. రాజా సభ్యులు. ఈసంఘం ఆఖరిసారి 1956 ఆగస్టులో సమావేశమై. డా॥ ఆనంద్ (ఫిజియాలజీ ప్రొఫెసరు), డా॥ ఖరాండికర్ (ఫార్మకాలజీ), డా॥ గడేకర్ (రేడియాలజీ) గార్లను నియమించింది. కాని డా॥ దీక్షిత్ నియామకం ఈ సంఘంతోగాని, 'కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్‌తోగాని ప్రమేయం లేకుండానే జరిగిపోయింది. ఆర్థో పీడిక్స్ ప్రొఫెసరు డా॥ దొరస్వామి నియామకం సర్వీస్ కమీషన్ ద్వారాను, అనాటమీ ప్రొఫెసరు డా॥ కేశ్వాని, బయోకెమిస్ట్రీ ప్రొఫెసరు డా॥ వరద్‌వేకర్, కార్డియాలజీ ప్రొఫెసరు డా॥ రాయ్‌గార్ల నియామకం అమెరికాలోను జరిగింది.

న్యాయం జరగడమే కాదు, న్యాయం జరిగినట్లు కనిపించాలని ఒక సూత్రం ఉంది. నియామక సంఘం సభ్యులు ఏ యే రాష్ట్రాల వారో, సెలెక్టు అయిన ప్రొఫెసర్లూ అవే రాష్ట్రాలవారుగా ఉన్నారని వైద్యవర్గాలలో పలువురు భావిస్తున్నారు. సెలెక్టు అయిన వారిలో ఒకరు పదేళ్లు తంటాలుపడి డిగ్రీ సంపాదించారు. ఫిజియాలజీ ప్రొఫెసరు డా॥ ఇంద్రజిత్ సింగ్ (ఆగ్రా విశ్వవిద్యాలయం) అఖిలభారత ఖ్యాతిగల డాక్టర్. కాని ఏ కారణం చేతనో ఆయనను తీసుకోలేదు. అలాగే డా॥ అరోరావంటి సమర్థుణ్ణి ఫార్మకాలజీ ప్రొఫెసరుగా నియమించనందుకు పలువురు విమర్శిస్తున్నారు.

అన్నింటికంటే రేడియాలజీ ప్రొఫెసరు నియామకమే విచిత్రంగా ఉంది. ఆరోగ్య శాఖామంత్రిణి అధ్యక్షత క్రింద చట్టరీత్యా ఏర్పాటుచేయబడిన మేనేజింగ్ కమిటీవారు మరో 5 ఏళ్లు దాకా ఎక్స్‌రే డిపార్టుమెంటు అక్కర్లేదని తీర్మానించారు. కాని రేడియాలజీ ప్రొఫెసరుగా ప్రస్తుతం సెలెక్టు అయిన ఆయనకి ఇప్పుడు 53 ఏళ్లు. అప్పటికి 58 దాటుతాయి. అందుచేత ఇప్పుడే ఆయన్ని నియమించేశారు. ఆయన పనీ పాటా లేకపోయినా జీతం పుచ్చుకునే పద్ధతిని ప్రదర్శించి చూపిస్తారు. అందరికంటేముందుగావిద్యాలయంలో చేరిందిఆయనే.

ఆసియా కంతటికీ పెద్దదైన వైద్యవిద్యాలయానికి అధ్యాపకులను ఇలా రిక్రూట్ చేయడం పార్లమెంటుదృష్టికి తీసుకురావడం జరిగింది. కాని ఆ విద్యాలయం వ్యవహారాలపై తమకు అజమాయిషీ ఏమీ లేదని సమాధానం చెప్పి ప్రభుత్వం తప్పించుకున్నది. కాని పైన చెప్పిన నియామకాలు జరిగిన తర్వాతగాని పార్లమెంటు శాసనం ద్వారా వైద్యవిద్యాలయానికి స్వతంత్ర ప్రతిపత్తిరావడం సంభవించలేదు. అదిగాక విద్యాలయానికి అధ్యక్షురాలెవరు? పార్లమెంటుకు బాధ్యురాలైన ఆరోగ్యశాఖా మంత్రిణిగదా! కనుక విద్యాలయంపై తప్పకుండా పార్లమెంటుకు అజమాయిషీ అధికారం ఉంది. పైగా విద్యాలయానికి ధనసహాయం చేసేది పార్లమెంటు. కనుక విద్యాలయం స్వతంత్రమని చెప్పి బుకాయించడానికి వీలులేదు. విద్యాలయానికి చెందిన ఆస్పత్రికి సూపరింటెండెంటును నియమించడం దగ్గిర ఉంది అసలు చిత్రమంతా. ఆఉద్యోగానికి దరఖాస్తులు కావాలని ముందు ప్రకటించారు. న్యూఢిల్లీలోని ఇర్విన్ ఆస్పత్రికి చెందిన డా॥ మెహతాకు ఆ ఉద్యోగం ఇద్దామనుకున్నారు. ఇంతలో ఒకానొక "ముఖ్యుడైన" డాక్టరుకు ఏదో ఉద్యోగం ఇప్పించడం జాతీయ సమస్య అయింది. ఆడాక్టరు 1947నుంచీ న్యూఢిల్లీలో ఉంటున్నాడు. ఆయన ఉద్యోగ విరమణ చేయాల్సినకాలం వచ్చింది. కాని మరేదైనా ఉద్యోగం ఏమైనా సరే, ఎలాగైనా సరే ఇవ్వాల్సిన అవసరం ఏర్పడింది. అందుచేత డా॥ మెహతాకు రావలసిన ఆ ఉద్యోగంరాలేదు. మళ్లీ మరో ప్రకటన పత్రికలలో వెలువడింది. ఆ ప్రకటనలో షరతులు "ముఖ్యుడైన" డాక్టరుకు సరిపోయేలాగ మార్చారు. అప్పటికే ఆ డాక్టరు ఛాతీ కొలవడం ఒకటి మానివేశారు.

అఖిలభారత వైద్య విద్యాలయానికి 1961 దాకా ఆస్పత్రి అంటూ ఉండదు. పరిశోధనకు సౌకర్యాలైనా లేవు అయినా విద్యాలయానికి ఒక డైరెక్టరు (డా॥ దీక్షిత్), ఒక శేర్ సెకరు (ఆరోగ్యశాఖలో పనిచేసే ఒకానొక ఛటర్జీ), 1961 దాకా ఏర్పడని ఆస్పత్రికి ఒక సూపరింటెండెంటు నియమితు లయ్యారు.

ఈవిధంగా అఖిలభారత వైద్య విద్యాలయం వృద్ధులై పింఛను పుచ్చుకోవలసిన డాక్టర్లకు ఉద్యోగా లివ్వడంకోసమే ఏర్పడ్డట్లు తోస్తోంది. పదవీ వ్యామోహమూ ప్రజాస్వామ్యమూ భార్యా భర్తలని చెప్పవచ్చు. వీటి దుష్టసంతానం కోకొల్లలుగా పెరిగిపోతోంది.

భారత ప్రధాని ప్రజలను కష్టపడి పనిచేసి భారత పురోభివృద్ధికి తోడ్పడండని పదే పదే ఉద్బోధిస్తున్నారు. అయితే ప్రజలు ఆయన ఉద్బోధను అంతగా పట్టించుకోకపోతే దానికి బాధ్యత అఖిల భారత వైద్య విద్యాలయంలాంటిసంస్థలదేనని చెప్పాలి. ★

(నాటిక)

# నీలి తెరలు

అంగర సూర్యారావు





గత సంచిక తరువాయి

దండ: (ప్రవేశిస్తూ) గోరం! గోరం! (ఆనంద్‌ను సమీపించి) ఆనంద బాబూ నాకు మంచి ఏషం ఇవ్వవయ్యా అంటే యిలాంటి ఏషమటయ్యా యిస్తావు?

ఆనంద్: నీ వేషానికేం? అమోఘమైన వేషం! యమధర్మరాజు వేషం అంటే మాటలా?

దండ: చాలు చాల్లేవయ్యా సెప్పావ్! నా వేషానికి మాటాలేదు, పాటాలేదు. పైగా సర్కస్ గుర్రంలాగా ముందుకీ యెనక్కీ గంతడం అటయ్యా నాపని!

దిన: శాంతించు! శాంతించు! మూడవ అంకంలో నీ ప్రతిభను ప్రదర్శించు కొనడానికి కావలసినంత అవకాశం కలిగిస్తున్నాను.

దండ: (సంతోషంతో) అద్గదీ! మా డింకరు బాబుగారికి నేనంటే యెలాగా అభిమానమే.

నిరం: (సిగరెట్టు వెలిగించి) దండపాణీ! నీపాత్రను వున్నంతలో ప్రతిభావంతంగా నిర్వహించావోయ్!

దండ: (నిరసనగా) ఆదేం యేషం బాబుగారూ! పులియేషం యేసినోడికి తోక పట్టుకునే వోడిలాగ గంతడం — ఒకటే గంతడం!

చిత్ర: (నేపథ్యంలోంచి) దండపాణీ, దండపాణీ!

దండ: వంచేశారు. ఇప్పుడే పిలిశాశే! ఈ యేషంతో యెల్లడమే! (నిరంజన్‌తో) అలా పైకి ఎల్లానని సెప్పండి బాబూ. ఈలోపుని రంగుకడిగేసుకుని వస్తాను.

(దండపాణి లోపలకు వెళుతూ పైకి నిష్క్రమిస్తాడు.)

నిరం: ఇక మన సంస్థ యొక్క ఉనికి ఎందుకైనా కళాభిరసజ్ఞుల ఏర్పాటు చేసుకుందాం, పదండి.

(లేచి ముందుకు నడుస్తాడు)

ఆనంద్: (నడుస్తూ) కిశోర్ తన పాత్రను అమోఘంగా నిర్వహించాడు. కాని మనిషికి కొంచెం ధైర్యం తక్కువ.

దిన: ప్రతిభావంతుడైన నటునికి కూడా నిజ జీవితంపై నీలితెరలు తప్పవు. తెర తొలగించుకొని రంగం అలంకరించేసరికి కాలం కాస్తా గడిచిపోయి పూరుకొంటుంది.

(ముందు నిరంజన్, ఆనంద్ - వెనుక దినకర్ ఎడమవైపు నిష్క్రమిస్తారు - చిత్ర చరచరా మేడమెట్లు దిగి క్రిందికి వస్తుంది. ఆమె ముఖంలో కోపం కనిపిస్తూనే వుంది. ఆమె వెనుక వినయంగా కిశోర్ వస్తాడు.)

చిత్ర: మీకు యిటువంటి దురలవాట్లు వున్నట్టు నాకు తెలియదు.

కిశోర్: నాటకంలో వేషం వెయ్యడం దురలవాటా? మీవంటి చదువుకున్నవాళ్లు కూడా అలా అంటే ఎలా? అది ఒక కళ!

చిత్ర. నటులు దురలవాట్లకు చేరువలో వుంటారని నాన్నగారు అంటారు. యింకా నయం. ఆయన మిమ్మల్ని వేషం వేస్తుండగా చూశాడు కాదు!

కిశోర్: చూస్తే కోపపడతారా?

చిత్ర: కేవలం కోపపడి వూరుకోరు. అసలు యీ సంబంధం పనికిరాదు పొమ్మంటారు.

కిశోర్: (ఆశ్చర్యంతో) ఏమిటి? సంబంధమా? మీ మాటలు నాకు బోధపడటం లేదు.

చిత్ర: (కోపంతో) మీకు తెలుగులో చెబితే బోధపడడంలేదా? మన 'మేరేజి'కి డాడీ ఒప్పుకోరు. యీసారి తెలిసిందా?

కిశోర్: (మరింత ఆశ్చర్యంతో) మీ ప్రవర్తన నాకు చాలా విచిత్రంగా కనిపిస్తోంది. నేను నిన్న యిక్కడ అడుగు పెట్టగానే పట్టుకున్నారు. కావలసినంత మర్యాద చేశారు. మీరు సహజంగా ఇక్కడకు వచ్చిన అతిథులకు ఆవిధంగానే మర్యాద చేస్తారని నన్ను నేను సమాధాన పరుచుకున్నాను. తరవాత మీరు కొన్ని ప్రశ్నలు వేశారు. కాలక్షేపంకోసం ఏదో అడుగుతున్నారని అనుకున్నారని అనుకున్నాను. జవాబులు చెప్పాను. మీకు వినోదం కలిగించేందుకు పాటలు పాడాను - కాని మీరు యిప్పుడు పెళ్లివిషయం ఎత్తడంతో - నా ఆశ్చర్యానికి మేరలేకుండావుంది.

చిత్ర:- (కొరడా దెబ్బ తిన్నదానివలె చలించి) మీకు యీ పెళ్లి యిష్టంలేదా?

కిశోర్. (సీరియస్‌గా) నేను యిక్కడకు పెళ్లి చేసుకునేందుకు రాలేదు.

చిత్ర: (హేళనగా) నాటకంలో వేషం వెయ్యడానికి వచ్చావా?

కిశోర్. బ్రతుకు తెరువుకోసం వచ్చాను. గత్యంతరంలేక నాటకంలో వేషం వేశాను.

చిత్ర. నన్ను మోసంచేద్దామనుకుంటున్నావా? నీకు బ్రదుకు తెరువుకు ఏం లోటు?

కిశోర్: (హేళనగా) మోసం. యీ కాలంలో ప్రతి యువతికి యీ మాట ఒకటి బాగా అలవాటు అయ్యింది.

చిత్ర: నువ్వు నోటికి వచ్చినట్లు మాట్లాడ్డానికి వీల్లేదు.

కిశోర్: వృథా వాగ్వివాదం దేనికి! యింక నాకు సెలవు.

# ★ నీలి తెరలు ★

(ఎడమవైపు వెడుతూ వుంటాడు)

చిత్ర: (ఆజ్ఞాపించే ధోరణిలో) ఆగు.

కిశోర్ : (ఆగి) యీ అనంతమైన బ్రతుకుబాటలో ముందుకు సాగి తీరవలసిందే. ఆగినందువల్ల ప్రయోజనం లేదు.

చిత్ర: (అతనిని సమీపించి ప్రార్థనాపూర్వకంగా) ఆగు! నా మాట విను. ఒక క్షణం కూర్చుని ఆలోచించు. విచారం ఎరుగని నా బ్రతుకును విచారంలో ముంచకు.

కిశోర్ : అయితే మీ అభిప్రాయం ఏమిటి ?

చిత్ర: (అతని రెండుచేతులూ పట్టుకొని) నీకు అర్థంకావడం లేదూ? నాతోనే జవాబు చెప్పించాలనుకుంటున్నావా ?

కిశోర్ : (చలించి ఆమె కళ్ళలోకి చూస్తూ) మీ కళ్ళలో ఏదో విచిత్రమైన శక్తివుంది. కాని వెనువెంటనే నా కర్తవ్యం నా స్మృతిపథంలో నిలిచి యీ ప్రదేశాన్ని విడిచిపొమ్మని నన్ను హెచ్చరిస్తోంది.

చిత్ర: వద్దు, వద్దు, నువ్వుమాత్రం ఆపని చెయ్యకు.

(కుడివైపునుంచి ముందు వామనమూర్తి వెనుక దామోదరం ప్రవేశిస్తారు)

వామ: (ప్రవేశిస్తూ) అమ్మాయ్, మీ నాన్నగారికి మా మాటమీద నమ్మకం కలగడం లేదోయ్.

(తండ్రిమాట వినగానే చిత్ర కిశోర్ చేతులు విడిచిపెడుతుంది. కిశోర్ వెనక్కి తిరిగి చూస్తాడు)

దామో : (కిశోర్ ను చూచి చకితుడై) యితనెవరు ?

వామ : (ఆశ్చర్యంతో) యితడు మీ అబ్బాయి కాదా ?

దామో : కాదు. కాదు దీనిలో ఏదో కుట్రవున్నట్లు కనిపిస్తోంది.

వామ : (కోపంతో కిశోర్ ను సమీపించి) ఎవరునువ్వు ? మాట్లాడవేం? మమ్మల్ని యిలా మోసం చెయ్యడానికి కారణం ?

కిశోర్ : (చలించకుండా) నేనేమీ మోసం చెయ్యలేదు. మిమ్మల్ని మీరే మోసంచేసుకున్నారు.—యీ క్షణంవరకూ నాకు నోరుతెరవడానికైనా అవకాశం కలగనివ్వలేదు మీరు. మర్యాదలతో ప్రశ్నలతో విందులలో వినోదాలతో నన్ను ఉక్కిరి బిక్కిరి చేశారు. ఇపుడిపుడే నాకు పరిస్థితి అర్థం అవుతోంది.

వామ : (ఉగ్రుడై) యింకా సిగ్గులేకుండా మాట్లాడుతున్నావు. నువ్వు మోసగాడవు. దగాకోరువు. నువ్వు జైలునుంచి విడుదల అయివచ్చిన పాతనేరస్థుడిలా కనిపిస్తున్నావ్.

కిశోర్ : (కోపంతో) మీరు గొప్పవారయితే కావచ్చును. కాని దారినిపోయే వాడిని పిలిచి అవమానపరచేహక్కు మీకు ఎంతమాత్రం లేదు.

వామ : (కోపావేశంతో) నాకు నీతిపాఠం కూడా బోధిస్తున్నావ్, పో. యిక్కడినుంచి ముందుకు బయటకు పో. మర్యాదగా బయటకు పోతావా ? లేక నాకరుతో బయటకు నెట్టించమంటావా ? (బిగ్గరగా) దండపాణీ. దండపాణీ.

(ఎడమవైపునుంచి తొందరగా దండపాణి వస్తాడు. అతని ముఖాన్ని యింకా నల్లరంగు వదలలేదు.)

దండ : (ఆశ్చర్యంతో) బాబుగారూ.

వామ : (కిశోర్ ను చూపిస్తూ) వీడిని మెడ పట్టుకుని బయటకు గెంటు.

(దండపాణి అర్థంకాక నోరు తెరచి చూస్తాడు.)

కిశోర్ : (విచారంతో) దరిద్రుడి చేతికి పెన్నిధిని అయాచితంగా అందించి— కొన్ని క్షణాలపాటు మోహజాలంలో ముంచి — తిరిగి లాగుకున్నట్లు వుంది. దీనికి ఒకరిని నిందించి ప్రయోజనం లేదు. యీ భయంకరమైన నీలితెరలను తొలగించుకొని ముందుకు పోవడంకంటే చేయగలిగిందేమీ లేదు.

(కిశోర్ కుడివైపు నిష్క్రమిస్తాడు.)

చిత్ర. (ఆశ్చర్యంనుంచి తేరుకొని) అతనిని అనవసరంగా నిందించారు డాడీ! యిందులో ఏదో పెద్ద పొరబాటు వుంది.

వామ : (కోపంతో) పొరబాటేమీ లేదు. నిలువునా దగాచెయ్యడానికి సిద్ధపడ్డాడు. పోలీసులకు అప్పగిస్తే అతడు మాజీ నేరస్థుడయ్యిందీ కానిదీ క్షణంలో తేలిపోయి వుండేది.

చిత్ర· (కోపంతో) మీ రిలా మాట్లాడతారనుకోలేదు. (బతిమాలుతూ) యిందులో అతని తప్పేమీ లేదు. నామాట విని అతనిని పిలిపించు నాన్నా!

వామ : (కోపంతో) యిక వూరుకో. ఎవరైనా వింటే నవ్వుతారు. నీకు ప్రపంచ జ్ఞానం బొత్తిగా లేదు

చిత్ర : (దృఢనిశ్చయంతో) మీరేం చెప్పినాసరే డాడీ, అతనిని తప్ప మరెవరినీ నేనిక పెళ్ళి చేసుకొనేది లేదు.

(చక చకా మేడమీదికి వెళ్ళిపోతుంది. దామోదరం వామనమూర్తి ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుంటారు. యిద్దరి ముఖాలలోకి దండపాణి చూస్తూవుంటాడు. — తెర.

★

—[ఇంకావుంది]





# పుష్పమువలె...
# రెక్సోనాతో మీ చర్మ సౌందర్యము వికసించును

అవును, రెక్సోనా సబ్బును ప్రతి రోజూ మీరు వాడుచుండుటవల్ల మీ చర్మ సౌందర్యము ఎంతో ఎక్కువ నవనవలాడుచు కాంతివంతముగా నగును: ఎందుకనగా పరిమళమైన రెక్సోన ఒక్కటే కేడిల్, చర్మ సౌందర్యము కొరకు నిర్మితమైన నూనెల ప్రత్యేక మిశ్రమము తోగూడియున్న సబ్బు రెక్సోనాయొక్క నిలవుండే పరిమళమును, సమృద్ధయిన మృదువగు నురగను వాడి ఆనందించుడు ఈ సౌందర్యమునిచ్చు సబ్బును ప్రతిరోజూ వాడుడు రెక్సోనా మీ సహజ మనోహరత్వమును బయల్పరచుటకు సహకరించును।






—ఇది ఒక్కటే కేడిల్ తో గూడిన సబ్బు

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్ తరపున భారతదేశంలో తయారుచేయబడినది    RP. 146-X52 TL

# నెలకైదురూపాయలు ఇస్తున్నాం!

"విూరింకా ఈ ఇళ్ళల్లోనే ఉంటున్నారా?" అని ఒక వరదబాధితుని పలుకరించాను. అతడసలు ఆర్యాపురంలో అద్దెకుంటేవాడు. ఆ రోజుల్లో, అంటే గోదావరి వరద ఇళ్ళల్లో ప్రవేశించి ఆర్యాపురాన్ని ఇన్నీసుటపేటను అట్టుడికించినట్టు ఉడికించిన ఆ రోజుల్లో.

అతడూ భార్యాపిల్లలూ అప్పట్లో అలా అలా ఈ కట్టిన కొత్తఇళ్ళల్లో ఒకదాన్ని తీసుకుని, అందులో ప్రవేశించారు. కుశల ప్రశ్న వేస్తే అప్పట్లో తాత్కాలికంగా ప్రవేశించాం అన్నారు. మళ్ళీ నేటికి ఆ ఇళ్ళు వాకిళ్ళు చూచాను. అంటే మరి మూడేళ్ళు గతించిన తరువాత ఆ హడావిడి ఆందోళన అదీ, తగ్గిపోయిన తరువాత ఈ మధ్యను కలుసుకున్నాము ఆపాటివిూదే!

అతిగాడు వెంటనే అన్నాడు "ఇక్కడే బాగుంది!" అని. "ఊరికే ఉండనిస్తున్నారా ఇప్పుడూను?" అని అడిగాను. "లేదండీ! నెలకు అయిదు రూపాయలు అద్దె కేసి పుచ్చుకుంటున్నారు. కాని అంతా మా స్వంతంలాగు వాడుకుంటూ వున్నాము. ఇక్కడ బ్రాహ్మణులు, సాయిబులు, సాలీలు, మాలవాళ్ళు అందరూ ఒక వీధినే మసలుతూ ఎడమ అవులేకుండా స్నేహభావాన్ని ఉంటూ వున్నాం. ఇక్కడ ఉన్న వాళ్ళు ఒక్కళ్ళూ అవతలకు వెడతాం అని అనడం లేదు. ఇదే నేడు ఇండియా వాంఛించే సంఘం అని తలపోస్తున్నాను." అన్నాడు ఆవలి వ్యక్తి. "అతను కష్టంలో చేదోడు వాదోడుగా ఆదుకొన్నవాళ్ళందరూ ఇక్కడకు చేరుకున్నారు! స్నేహభావం కుదుర్చుకున్నారు! బాగాఉంది" అంటూ ఒక అడుగు ముందుకు వేశాను.

పూర్వం తోట్లు పాతిన నారాయణం మొక్కలు ఇప్పుడు పెద్ద చెట్లైనాయి.

## కవికొండల వేంకటరావు

మరీన్నీ సీతామ్మవారి జడబంతి, మెట్టతామర, అటువంటివన్నీ ఎదిగి, పూలు పూస్తున్నాయి. అన్నిటికంటె చెప్పొచ్చేది ఒక ఆనపపాదు ఒక ఇంటివిూద తాటాకు కప్పువిూద పాకుతూ అది అంతా అలుముకు పూలతోను పిందెలతోను కనబడింది. మరీన్ని చిక్కుడు పాదు లక్కడక్కడున్నాయి. ఎక్కుతూ వ్రేలాడుతూ! అయితే దిట్టమైన పందిరి ఒకదానికీ లేదు. ఎలా పాకితే అలా పాకనిస్తూ వున్నారన్నట్టు కనబడింది. కాని ఆకు స్ఫుటంగా వుంది. ఆకు పచ్చగా వుంది. అంతా సొంపుగా వుంది ఆ జాగా అంతాను.

అలా వెళ్ళగా వెళ్ళగా కొన్ని యిళ్ళయొక్క కప్పులు ఎగిరిపోయాయి. కొన్ని వెదుళ్ళు లాగివేయబడ్డాయి. అయినా ప్రజలు అలాగ్గానే కాపురం చేస్తున్నారు.

మరీన్ని ఎక్కడి పెంట అక్కడే యథావ్యవబడి పోగుపెట్టబడి వుంది. దాన్ని ఎవరూ ఎత్తి ఆవల దూరంగా పారబోయడం లేదు. అయినా వాళ్ళు నెలకు అయిదు రూపాయలు అద్దె ఇంటింటికి ఇస్తూ కాపురం చేస్తూ వున్నారు.

ఇదంతా చూస్తే ఒక వేడుకా వేసింది, ఒక విషాదం కలిగింది. చిన్నపిల్ల లెదుగుతూ వున్నట్టు, పెద్దవాళ్ళు వృద్ధులవుతూ వున్నట్టు పొడగట్టింది.

ఇంకా ఆ ప్రాంతాన్ని అక్కడే త్రవ్వాడుతూ వున్నాను. ఒక కంట్రాక్టరు ఎదురుపడి "ఇలా వచ్చారేం?" అని అడిగాడు. నేను కంట్రాక్టరుతో "ఇంకా యీ యిళ్ళు తీసివేయక ఇలా వుంచారేం?" అని అన్నాను, "తీసివెయ్యడానికి కొంత ఖర్చు అవుతుందండీ! వాటిని తీసివేయకుండా వాటంతటవి పడిపోయేటట్టు చేశాం" అన్నాడు కంట్రాక్టరు నవ్వుతూ! "వాళ్ళ దగ్గఱ అయిదు రూపాయలు అద్దె నెలకు తీసుకుంటూన్నందుకా?" అని అడిగాను నేను హేళనగా. "అందుకు కాదండీ! ఉన్నన్నాళ్ళూ నెలకు అయిదు రూపాలు ఇవ్వకేం జేస్తారు? ఇస్తారు! కాని వానంపోతే వానం, ఆకుపోతే ఆకు, పెరుగులోంది చూడండి! ఎన్నాళ్ళకు పోను ఈ యిళ్ళు?" అని అన్నాడు అతడు అతిసీరియస్గా.

అంటే తుదిసారి మళ్ళీ చూచాను ఆ యిళ్ళ వంక, ఆ యిళ్ళచుట్టూ అరటిచెట్లూ ఆ యిళ్ళ విూదకు వెదురు పొదలూ వాలి అదో అందాన్ని ఇచ్చాయి. అలాంటి ఒక ఇంట్లోకి ఒక పదహారేళ్ళమ్మాయి పాలకేంద్రంలోంచి పాలు పట్టుకెళ్ళిపెళుతూవుంది. ఆమె నెన కాల పిరుదులవిూద జడగంటలు నీడాడుతూ ఇంపుగొల్పాయి. దూరాన్ని ఒక పైపు నీళ్ళు చిమ్ముతూవుంది. అంతకంటె దూరాన్ని దిఙ్మండలంవిూద చంద్రవంక, ఒక నక్షత్రం కనిపించాయి.

వీళ్ళిచ్చే అద్దె అయిదురూపాయలు వీటన్నిటి కోసం ఇస్తూవున్నారు లాగున్నది. ఇదే సూర్యచంద్రుల్ని ఇంటిలో నిలపడం అని అనిపించింది. అవినే ఆ అమ్మాయికూడా నిల్చివుండా! ఇల్లులేకపోతే అక్కడ నిలిచి వుంటుందా? అనికూడా తోచింది. ★

# కుమార భాస్కరుడు

[అది వినుకొండ పట్టణము. రాయన భాస్కర మంత్రి గొప్పదాతగా పేరుపొంది చనిపోయాడు. ఆయన గతించినతర్వాత, ఆయన పుత్రులు తండ్రి దానగుణాన్ని అవలంబించారు. ఆ విధంగా భాస్కర వంశీయులు దానధర్మాలకు ప్రసిద్ధికెక్కారు. .. భాస్కర మంత్రి ఇల్లు. కృష్ణుడు, రాముడు ప్రవేశం]

కృ. రా : భాస్కరం! భాస్కరం!

కు. భా : ఆఁ వస్తున్నా.

రా ఏమిటి ఆలస్యం! మన స్నేహితులంతా నీ కోసం ఎగురు చూస్తున్నారు.

కు. భా : బంతి తెచ్చారా?

కృ. ఆ! అన్నీ తెచ్చాం! రద్దూ, ఆలస్యం చెయ్యక!

కు. భా : ఇప్పుడే వస్తా, అమ్మతో చెప్పి అమ్మా! అమ్మా!

యెలమాంబ ఏం బాబూ!

కు భా : ఆడుకుందుకు వెడుతున్నానమ్మా!

యె · మంచిది ఆడుకుని త్వరగా యింటికి వచ్చేయి!

కు. భా . అలాగే.

యె బాబూ! యిలారా ... యీ బట్టలన్నీ బాగా మాసిపోయేయి. మరోజత తొడుక్కుని వెళ్లు

కు. భా · అన్నిజతలు మాసిపోయేయమ్మా ఇదేవుంది

యె (బాధగా) సరే వెళ్ళిరా బాబూ!.. కృష్ణా! పోట్లాడుకోకుండా జాగ్రత్తగా ఆడుకోండి.

రా · పదరా భాస్కరం!

*   *   *

దాసి అమ్మగారూ! అమ్మగారూ!

యె (పరధ్యానంగా మౌనం)

దాసి అమ్మగారూ! ఏదో పరధ్యాన్నంగా ఉన్నారే!

యె : (బాధగా) ఏమీ లేదు. బాబుకు కట్టుకుందుకు శుభ్రమైన బట్టలైనా లేవు మాసిపోయిన బట్టలతో ఆడుకుందుకు వెళ్ళిపోయాడు

దాసి . అవునమ్మగారూ! యీ యిల్లు సిరిసంపదలతో మునుపు ఎంతో కలకలాడుతూ ఉండేది. రాయన భాస్కర మంత్రి వారి దానధర్మాలకు దేశమంతా ఆశ్చర్యపోయేది. అటువంటి కుటుంబానికే బీదరికం వచ్చింది.

## పాత్రలు

కుమార భాస్కరుడు.

యెల్లమాంబ (తల్లి)

భట్టు.

రాముడు, కృష్ణుడు (కుమార భాస్కరుని స్నేహితులు)

దాసి.

యె · తండ్రి బ్రతికిఉన్నా, బాబుకు ఇంతకష్టం కలిగేది కాదు. ఇంత చిన్నతనంలోనే తండ్రిలేని నా బాబును చూస్తోంటే కడుపు తరుక్కుపోతోంది.

దా : విచారించకండి అమ్మగారూ భాస్కరబాబుకూడా తాతగారిలాగే గొప్పపేరు సంపాదించుకుంటారు. బాబు ముఖం ఎంతో కలకల్లాడుతూ ఉంటుంది ఎప్పుడూ!

యె : ఏమో! ముందుసంగతి ఏం చెప్పగలం? (నిట్టూర్పు)

*   *   *

(పిల్లల కల్లోలం.. బంతి ఆట)

కు భా. ఏయ్! కృష్ణా! ఆబంతి యిలా విసురు!

రా · ఆబంతి నే పట్టుకుంటూ చూడు.

కృ · (గట్టిగా నవ్వుతూ) ఎంత పైకి ఎగిరిందో బంతి!

కు. భా నాకు దొరికింది బంతి? . విసురుతా పట్టుకోండి

కృ : ఏయ్! ఆబంతి మురికి గుంటలోకి పోతోంది! పట్టుకో.

రా తన్ను. ప్రక్కనుంచి తన్ను.

కు భా: (హిహిహి) బలేగా ఎగిరింది బంతి.

కృ · బంతి యిల్లా తీసుకు రారా!

రా : ఇంటికి పోదామా?

కు. భా. అప్పుడేనా?

పోతుకూచి
సాంబశివరావు

కృ : భాస్కరం! ఎవర్రా మీ యింటి ముందు నుంచున్నారు?

కు. భా: ఏమో

రా : ఇందాకటినుంచి చూస్తున్నాను. ఆయన అక్కడే నుంచున్నారు.

కు. భా : ఎవరో కనుక్కుందాం. పదండి.

*   *   *

భట్టు : ఎటువంటి వైభవంతో కలకల్లాడే యిల్లు! సంస్కారం లేక యీనాడు యిలా బూజు పట్టిపోతోంది. ఎప్పుడూ ధానధర్మాలతో, అవి అందుకునే బ్రాహ్మణులతో, పేదలలో నిండి కలకల్లాడుతూండే ఆరాయన భాస్కరమంత్రి మందిరం యీనాడు సామాన్యగృహంలా వెలవెలబోతోంది. కాలం మార్పులు చిత్రంగా ఉంటాయి. రాయనభాస్కరుని దాతృత్వకీర్తి వాడవాడలా వ్యాపించింది అటువంటి గొప్పదాత యీమధ్య కనిపించలేదు. ఆయన్ను కీర్తించని మనిషేలేడు ఆ రోజుల్లో!.. కాని ఈ రోజుల్లో!! రాయనభాస్కరుడు లేడు ఆయన కుటుంబం చితికిపోయింది! రాయనభాస్కరుతోడనె పోయెక దా కీర్తి కాంత !!

కు. భా . పోలేదు కీర్తి కాంత! పోదు!

భట్టు : ఎవరది ?

కృ : ఇతను రాయన భాస్కరుని మంత్రి మనుజుడు !

రా రామలింగ భాస్కరుడు ఇతని పేరు.

భ : (నవ్వుతూ) మీ కుటుంబం గురించి ఉన్న మాట అన్నందుకు కోపం వచ్చిందా బాబూ! రాయనభాస్కరుడు పేరుకెక్కిన దాత. అడగనివానిదే పాపం! అడిగినవానికి ఆయన ఎప్పుడూ లేదనలేదు. ఆయన దానగుణానికి దైవం కూడా సంతోషించాడు. ఆయన దానవ్రతం ఎప్పుడూ భగ్నమయ్యేది కాదు. ఏమీ లేనీ మడిసంచిలో చెయ్యిపెట్టి, ఒక గ్రహణంరోజున, దైవకటాక్షంతో బంగారు మాడలు బ్రాహ్మణులకు పుష్కలంగా దానంచేశాడు. పచ్చల కంకణాలు దానంచేస్తే, సంతోషించి గంగాభవాని తన కంకణాల చేతులు ప్రజలకందరికీ చూపించింది; రాయనభాస్కరుని మహిమకు ఆనవాలుగా, ఇప్పుడు నీ కుటుంబంలో ఏదీ నాయనా అటువంటి దానం; నువ్వే


BREEZE



# కుమార భాస్కరుడు



బీదరికంలో బాధపడుతున్నట్లు కనిపిస్తోంటే, దానశక్తి మీ కుటుంబంలో ఏదీ ఇంక!!

కు. భా : ఇదుగో! కీర్తికాంత ఇంకా పోలేదు! దానధర్మాలు యింకా పోలేదు మా కుటుంబంలో! యీ బంగారు కడియం తీసుకోండి!

భట్టు : (ఆశ్చర్యంగా) బంగారు కడియం!. బం గా. రం..

కృ : అవును బంగారం కడియమేనండీ!

భ : బాబూ! మీ వంశం యొక్క గుణమే దానగుణం! అది పోలేదు బాబూ! తరతరాలుగా ఆ గుణం వర్ధిల్లుతోంది! మీరు దానంధరించిన మానవస్వరూపులు!... నేను ధన్యుణ్ణి! బాబూ! నీ తండ్రి తాతల కీర్తి నిలబెట్టావు. నీ తాతగారి దానాన్ని జ్ఞప్తికి తెచ్చావు! వెయ్యేళ్ళు వర్ధిల్లుబాబూ! మీ తాతగారిలా దైవకటాక్షంతో దాన ధర్మాలతో పేదవారిని ఉద్ధరించు బాబు !

కు. భా : తమ ఆశీస్సులచలవ అమోఘం! నమస్కారం భట్టుగారు!

భ : వెయ్యేళ్ళు వర్ధిల్లు నాయనా! సెలవు! (నిష్క్రమణ)

కృ. భాస్కరం! ఆ బంగారుకడియం యిచ్చేశావు! మీ అమ్మగారు కోప్పడరూ?

రా. ఏమో! అభట్టు ఏదో విచారించాడని ఆ కడియం యిచ్చేస్తే, మనకు గొప్ప ఏమొస్తుంది! ఉన్నకడియంకొస్త ఊడిపోయింది.

కృ : బంగారు కడియంఇస్తే ఎవడైనా పొగడుతాడు. ఇస్తేపొగడ్డం, యివ్వకపోతే తిట్టడం వీళ్ళకి అలవాటే!

కు. భా. తప్పు! అలా అనకూడదు! అడిగినవానికి దానంచేస్తేనే ఆనందం కలుగుతుంది.. పదండి ఇంటికి వెడదాం.

* * *

రా : ఏమండీ! మరేమోనే!

యెల్లమాంబ : ఏమిటి నాయనా?

కృ మీ అబ్బాయి ..

యె ఏం చేశాడు?

రా : మేమంతా వద్దంటూంటే...

యె. ఏంచేశాడు మాబాబు! రాముడూ?

కృ : ఎవరోభట్టు వీధిలోనుంచుంటే...

యె. (కంగారుగా) అసలుసంగతిచెప్పు! ఏంచేశాడు మా భాస్కరం?

రా : చేతికడియం తీసియిచ్చేశాడు.

యె : అలాగా!

కు. భా : అవునమ్మా! ఆ భట్టు మన యింటిముందు నుంచుని మనకుటుంబం కీర్తి ప్రతిష్ఠలు పోయాయన్నాడు. మన తాతగారిలా దానంచేసేమనిషి యిప్పుడు ఎవ్వరూ లేరన్నాడు. మనం చితికిపోయేమని సానుభూతి చూపించాడు. ఇంక ఈ కుటుంబంచేసే దానధర్మాలు ఆఖరయి పోయేయి అన్నాడు. నాకు బాధ కలిగిందమ్మా!...ఆ భట్టుమాటలు మన కుటుంబానికి మచ్చ తెచ్చినట్లు అనిపించింది. తాతగారి పేరు నిలబెట్టాలనుకున్నా ... నా చేతి బంగారు కడియం దానం చేసేశానమ్మా ఆభట్టుకు.

యె: మంచిపని చేశావు బాబూ!.. తాతగారి పరువు ప్రతిష్ఠలు నిలబెట్టావు.

రా: ఆకడియం బంగారండి! అలా బంగారుకడియం యిచ్చేస్తే మాఅమ్మ మాత్రం ఊరుకోదు.

యె: యాచకులకు దానంచెయ్యడం మనధర్మం.

కు భా. అమ్మా! నేతప్పు చేసేశానా?

యె. నువ్వు పూర్తిగా తప్పు చెయ్యలేదు సగం తప్పుచేశావు!

కు భా. అదేమిటి అమ్మా!

యె. మీ తాతగారు దానం పుష్కలంగా చేసేవారు. ప్రతీవానిని సంతృప్తిపరిచేవారు. తన దగ్గర ఉన్నది అంతా యిచ్చేసేవారు. ఒకరోజున, రాయలు, ఆయనకు కనకాభిషేకంచేస్తే ఆ అభిషేకంవల్ల వచ్చిన బంగారు మాడలన్నీ సంతోషంగా బ్రాహ్మణులకు పూర్తిగా దానంచేసేశారు. దానం ఇతరులకు సంతృప్తికలిగేలా చెయ్యాలి బాబు! రెండవచేతి ఆ బంగారు కడియం ఎందుకు దాచుకున్నావు? అదికూడా ఆభట్టుగారికి యిచ్చేయ వలసింది. సగం దానం చెయ్యకూడదు. ఆ రెండవకడియం కూడా దానంచేసి తాతగారి పేరు నిలబెట్టు బాబు!

కు. భా: అర్ధమయింది. తప్పుచేశానమ్మా! నిజంగా తప్పుచేశానమ్మా నేను!...ఇప్పుడే ఆభట్టును పిల్చుకు వస్తా.

కృ : నే తీసుక్క వస్తా! నువ్వు యిక్కడే వుండు భాస్కరం! ఇప్పుడే తిరిగివస్తా (నిష్క్రమణ)

యె. దానగుణం చాలాగొప్పది. మనం అనుభవించిన దానికంటె ఒకరికి యిచ్చిన దానికే ఎప్పుడూ విలువకల్గుతుంది. దానం మన వంశలక్షణం బాబు! అది ఎల్లప్పుడూ మన కుటుంబంలో వర్ధిల్లాలని దైవాన్ని ప్రార్థిద్దాం.

భట్టు: (ప్రవేశిస్తు) పిలిపించారా అమ్మా

కు. భా. భట్టుగారూ! మీకు చాలా అపచారం చేశాను, మీకు బంగారు కడియం ఒక్కటే యిచ్చి రెండవది దాచుకున్నాను. క్షమించండి...ఈ రెండవకడియం కూడా తీసుకోండి!

భ : ఏమిటిబాబు! నువ్వు అంటున్నావు? (ఆశ్చర్యంగా) రెండవ కడియం కూడా తీసుకోమనా?

కు. భా: అవును! తీసుకోండి!

యె: తీసుకోండి భట్టుగారూ! సగం దానం చెయ్యడం మా వంశప్రతిష్ఠలకే అగౌరవం.. తీసుకోండి!

భట్టు: నా జన్మతరించింది. రాయన భాస్కరుడే మళ్ళీ కుమార భాస్కరుడుగా అవతరించాడు. ఆయన బ్రతికున్న రోజుల్లో పుష్కలంగా దానం లభించేది. మళ్లీ ఆరోజులు వస్తున్నాయి తప్పకుండా వస్తాయి! సిరిసంపదలతో, దానధర్మాలతో, కీర్తి ప్రతిష్ఠలతో, పదవీ ప్రతిభలతో, వెయ్యేళ్ళు వర్ధిల్లుబాబు! మీ భాస్కరుల వంశం, ధాన ధర్మాలతో, భాస్కరుని తేజస్సులా ప్రకాశిస్తుంది! ... వెయ్యేళ్ళు వరిలు నాయనా!!!



# మంత్రోపదేశం

ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

శ్రీరంగేశుని సందర్శించిన రామానుజుని విశాలనేత్రాలు అశ్రుయుక్తంగా అలవోకగా మూసుకొన్నాయి చెక్కిళ్ళపై ఆనందబాష్పాలవిరళధారగా ప్రవహించాయి

ఆ భక్తి పారవశ్యం చూచిన దేవాలయార్చకు లత్యాశ్చర్యంతో క్షణకాలం నిశ్చేష్టులై నిలిచారు

తండోపతండాలుగా తైర్థికులనేకులు శ్రీరంగనాథుని సందర్శిస్తారు ఆ మరునాడే తిరిగి తమ స్వస్థానాలకు మరలిపోతారు శ్రీరంగ పుణ్యక్షేత్రానికెంతమంది భక్తులు రావడంలేదు! ఎంతమంది శ్రీరంగనాథుని సందర్శనభాగ్యం పొందడంలేదు! కాని అంతటి భక్తి పారవశ్యం కలిగిన మహావ్యక్తిని వారంతకు పూర్వం ఎన్నడూ చూడలేదు ఆ క్షణంలో ఆ మహనీయునికి సాక్షాత్తుగా శ్రీరంగనాథుని దివ్యదర్శనభాగ్యమే లభించి ఉండవచ్చుననీ అతడెవడో పరమ బ్రహ్మజ్ఞుడై ఉండవచ్చుననీ వారు నిశ్చయించుకొన్నారు.

రామానుజుడు స్వామి సందర్శనం పూర్తికాగానే దేవాలయపుష్కరిణీతీరంలో సాయంసంధ్యా నియమాచరణ కుపక్రమించాడు

అతని కెదురుగా పుష్కరిణీతరంగాలలో సాయంకాలకాంతులు ప్రసరించాయి తెలని తామరలన్నీ ఎర్ర దామరలుగా మారిపోయాయి పుష్కరిణి మధ్యభాగంలో శ్రీరంగ దేవాలయ శిఖర సువర్ణకలశం అప్పుడప్పుడే ముకుళించిన బంగారు తామర మొగ్గలా తళతళ మెరిసింది

అది చూడగానే రామానుజుని హృదయంలో శ్రీరంగేశుని పాదపద్మాలు స్ఫురణకు వచ్చాయి. ఉత్తరక్షణంలోనే అతని చెక్కిళ్ళపై బాష్పబిందువులు సంతతధారగా ప్రవహించాయి

రామానుజయతి తన కాషాయ వేషం చూచుకొని హృదయాంతరాళంలో ఎంతైనా మురిసిపోయాడు పూర్వజన్మ పుణ్యపరిపాకంవల్లనే తన కావిధంగా కాషాయ వస్త్రాలు ధరించే మహాదృష్టం పట్టినదని ఉప్పొంగిపోయాడు

భార్యను పుట్టింటి కొకమారు పంపించవలసిందని హఠాత్తుగా అతని మామగారిదగ్గర నుంచి కబురు వచ్చింది. అదను దొరికినదను కొని వెంటనే రామానుజు డామెను పుట్టింటికి పంపించివేశాడు

భార్య తన సహధర్మచారిణీ వ్రతం యథాశక్తిగానయినా నిర్వహింపగలదేమోనని రామానుజు డెంతయినా ఓరిమి వహించాడు ఒకసారి ఆమె పరమభాగవతోత్తము డనీ, గురువర్యుడనీ తానెంతో గౌరవించిన పెరియనంబి మనస్సెంతైనా నొప్పించింది పెరియనంబి కుటుంబంవారు తమకంటె తక్కువవారని రామానుజుని భార్య ఎన్నెన్నోమారు లాయన చెవిలో ఇల్లు కట్టుకుని పోరింది రామానుజుడు నయాన, భయాన చెప్పిచూచాడు ఆమె వినలేదు ఆమె చాదస్తంవలన ఒకసారి మంచినీళ్ళ బావిదగ్గర ఆమెకు, పెరియనంబిభార్యకు మధ్యన ఒక పెద్ద రభస చెలరేగింది అది పెరియనంబిచెవిని పడింది పెరియనంబికి రామానుజుని మనస్సు నొప్పించడం సుతరాము ఇష్టంలేదు అందుచేత ఆ ప్రస్తావనైనా ఎత్తకుండా ఆ మరునాడే సకుటుంబంగా మరి ఒక గ్రామానికి వెళ్ళిపోయాడు ఇంతజరిగినా రామానుజు డోరిమి వహించాడు. ఆమె నేమీ అనలేదు

ఇంకొకసారి రామానుజయతి తిరుక్కచ్చినంబిని తన కుటీరాని కాహ్వానించాడు కొంతసేపిద్దరు ఇష్టాగోష్ఠిలోపడి బ్రహ్మసూత్రార్థ చింతనచేశారు తిరుక్కచ్చినంబి వెళ్ళినతరువాత రామానుజునిభార్య తిరుక్కచ్చినంబి కూర్చున్నప్రదేశం మైలపడిపోయిందని అదంతా గోమయంతో అలికి పరిశుభ్రంచేసింది అయినా రామానుజు డేమీ అనలేదు అలాగే నెమ్మదిగా ఆమె కెన్నోవిధాల చెప్పిచూచాడు. ఎంత చెప్పినా ఆమె వినలేదు పైగా ఆయనకే ఎదురు చదువుచెప్పడం మొదలుపెట్టింది అయినా రామానుజుడు తన ఓరిమి విడనాడలేదు

ఇంకొకసారి రామానుజుడు దైవదర్శనానికి వెడుతూంటే కడజాతివాడొకడు 'అన్నమో రామచంద్రా!' అని ఆర్తనాదం చేశాడు. అది రామానుజుని చెవిని పడింది వెంటనే ఆ కరుణానిధి హృదయం ద్రవించింది

"నాయనా! అదిగో మా యిల్లు! అక్కడికి వెళ్ళి నేను నీకింత అన్నం పెట్టమన్నానని చెప్పు! త్వరగా అక్కడికి వెళ్ళు!"

అని సాదరంగా ఆ కడజాతి దీనుణ్ణి తన ఇంటికి పంపించాడు అతడు తిరిగివచ్చేలోగా దైవదర్శనం ముగించుకొన్నాడు అంతలోనే ఆ అస్పృశ్యు డక్కడికి తిరిగి వచ్చాడు అమ్మగారు తనకు పట్టెడన్నమైనా పెట్టలేదని మొరపెట్టుకొన్నాడు అది వినగానే ఆ కరుణామూర్తి హృదయం ఒక్కమారుగా వేయి ముక్కలైపోయింది మారు మాటాడకుండా తన ఇంటికి వెళ్ళిపోయాడు

ఇంటిలో అన్నం లేకపోలేదు! అయినా రామానుజునిభార్య కేవలం ఛాందసంవల్ల ఆక్షుధార్తుని కిన్ని మెతుకులైనా పడవేసిన పాపాన పోలేదు!

ఇక రామానుజు డోరిమివహించలేకపోయాడు. కాని ఆ క్షణంలో ఆమె నేమీ అనలేదు అటుపిమ్మట మామగారిదగ్గరనించి కబురందగానే వెంటనే ఆమెను పుట్టింటికి పంపించివేశాడు ఆ ప్రయాణాని కామె కూడా కొంత సంబరపడింది అయితే ఆ మరునాడే రామానుజుడు కాషాయవస్త్రాలు ధరించి యతిధర్మం స్వీకరించాడు ఆమె మీద జాలికలిగినా—విధివిధానం అనుల్లంఘనీయమని అనుకొన్నాడు వెంటనే శ్రీరంగనాథుని సందర్శనంకోసం శ్రీరంగం చేరుకొన్నాడు.

కాని అంతమాత్రంచేత రామానుజుని హృదయం శాంతిపొందలేదు శ్రీరంగంలో తిరుకోటియూరునంబి మహాతపస్వి అనీ మహామంత్రవేత్త అనీ రామానుజుడు వైష్ణవ

నిం(ద్రప్రాయాసే త్తులవల్ల కష్టాకర్షిగా వచ్చాడు.

కాని శ్రీరంగంలో ఆ మహాత్ముని పటికానికి దారిచూపించేవాళ్ళ కనబడలేదు బాగా చీకటి పడింది. రామానుజాడు శ్రీరంగ నగరం తిరిగి తిరిగి ఎలాగో అలాగ తిరుకోటి యూరునంబి గృహం చేరుకొన్నాడు.

వీధి గుమ్మంలో నిలబడిన శిష్యునిద్వారా తిరుకోటినంబికి తనరాక తెలియజేశాడు శిష్యుడు తిరిగి వచ్చి ఆ సమయంలో ఆచార్యుని దర్శనం వల్లపడదని కటువుగా కసిరి కొట్టాడు రామానుజాచార్య(తి అంతా వస్తున్నాడు.

ఆ మరునాడు ముదయమే కావేరి పుష్కరిణిలో స్నానంచేసి ఉతికి ఆరవేసుకొన్న కాషాయవస్త్రాలు ధరించి ఆచార్యుని సన్నిధికి వెళ్ళాడు.

ఈమారు తిరుకోటినంబి దర్శనమైతే దొరికిందిగాని అతడు రామానుజాడ్ని కూర్చోమని కూడా అనలేదు

"ఇప్పుడుకాదు! మరి పదిరోజాలు పోయిన తరవాత ఒకసారి కనబడు!"

అని కసిరి కొట్టి తటాలున లోపలికి వెళ్ళి ద్వారం మూసివేసుకొన్నాడు

## ౨

రామానుజాచారని కొరినాని కెంతో నొచ్చుకొన్నాడు. చివరికి గృహస్థమర్యాద కూడా పాటించకుండా ఆచార్యుడా ఆ విధంగా అమర్యాదగా ప్రవర్తించడం అతని కెంతో విడ్డూరంగా కనబడింది

అటుపిమ్మట సరిగా పదిరోజులవరకు వేచిఉండి మళ్ళీ అతని సందర్శనానికి వెళ్ళాడు. ఆచార్యుని గృహంలో ప్రవేశిస్తూనే ఆయన పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాడు అనుగ్రహించేవరకు పాదాలు విడిచిపెట్టనని భీష్మించుకొని



# ★ మంత్రోపదేశం ★

కూర్చున్నాడు:

"ఇది మంత్రోపదేశాని కనువైన శుభ ముహూర్తంకాదు. మళ్లీ ఎప్పుడైనా ఇంకొక పర్యాయం కనబడు!"

అన్నాడు తిరుకోటినంబి అలాగ తిరుకోటినంబి అతన్నింకా రెండు మూడు సారులు "రేపురా! మాపురా!" అని త్రిప్పిపంపాడు. అయినా రామానుజుడు తన ఓరిమి విడనాడ లేదు. అప్పటికి తిరుకోటినంబి కతనిపై అనుగ్రహం కలిగింది.

ఆచార్యుడు నిశితంగా రామానుజుని ముఖవైఖరి పరిశీలించాడు:

"నాయనా! ఇన్ని మారులు నిన్నెందుకు విసిగించానో నీ కిప్పటికైనా తెలిసి వచ్చిందా?"

రామానుజుడు తన క్షమి తెలియ లేదన్నట్లాశ్చరంగా తిరుకోటినంబి వైపు చూచాడు:

"రామానుజా! ఇది అష్టాక్షరీ మహామంత్రం! యథావిధిగా ఇది పునశ్చరణ చేసిన వారికి శ్రీ మహావిష్ణుసాయుజ్యం కరతలామలకం! ఎంతటి మహాపాపాత్ములైనా సరే! ఈ మంత్రం ఒకమారుచ్చరించినంతమాత్రాన మహా పాప విముక్తులౌతారు!

"అయితే శ్రద్ధా భక్తులు లేనివారికిది ఉపదేశింపరాదు. కనుకనే నిన్నీవిధంగా పరీక్షించాను! తెలిసిందా?"

రామానుజుని కిప్పుడా విషయంలో కొంచెం కనువిప్పు కలిగింది. అతడేదో ప్రశ్నించబోయాడు. అంతలోనే ఆచార్యుడు మేఘగంభీరస్వనంతో గర్జించాడు:

"నాయనా! మంత్రోపదేష్టలు శిష్యుల పాపభారం అంతా భరించవలసి ఉన్నది. అందుచేత మంత్రోపదేశం కేవలం అసిధారావ్రతమే! ఈ మహామంత్రం నీ వతిరహస్యంగా, మహాగోప్యంగా సంరక్షించుకోవాలి! గుర్వాజ్ఞ లేనిదే ఇతరుల కెవరికీ ఇది ఉపదేశింపకూడదు! తెలిసిందా?"

రామానుజుడన్నిటికీ అంగీకారసూచకంగా తిరుకోటినంబి పాదాలకు భక్తికంగా సాష్టాంగనమస్కారం చేశాడు.

వెంటనే ఆచార్యుడతనికి యథావిధిగా అష్టాక్షరీమంత్రం ఉపదేశించాడు.

మంత్రోపదేశం పొందిన నాలుగైదు రోజులవరకు రామానుజయతి అన్నపానాలు కూడా విసర్జించి తదేకదీక్షతో మంత్ర పునశ్చరణ చేశాడు.

ఆ మహామంత్రం అలాగ పునశ్చరణ చేసిన కొద్దీ అతని హృదయంలో ఆనంద వీణా తంత్రులు లోకేశ్రుతిలో మారుమోగాయి. క్రమక్రమంగా అతని హృదయంలో అనిర్వాచ్యమైన ఆనందానుభూతి కలిగింది శ్రీరంగనాథుని సందర్శనంకోసం నడచివెళ్లే సమయంలో అతని పాదాలాకాశంలో తేలిపోతూన్నట్టుగా స్ఫురించింది. క్రమక్రమంగా ఆ మంత్ర పునశ్చరణదీక్షలో అతనికి అన్నపానాదులపై ఆసక్తి సడలిపోయింది.

మరి నాలుగైదురోజులు గడచిపోయేసరికి రామానుజుని కొక దివ్యవిజ్ఞానజ్యోతి స్ఫురించింది. ఆ విజ్ఞానజ్యోతి వెలుగులో ప్రపంచం అంతా అతని కొక అత్యంతవిచిత్రధోరణిలా కనిపించింది.

రామానుజుని సహచరులందరు అది కనిపెట్టి అతని కేదో మతిభ్రమణం కలిగిందనే అనుకొన్నారు. అయితే ప్రపంచంలోని వారంతా రామానుజునికి కేవలం మతిపోయిన వారిలాగే స్ఫురించారు!

అతడొకనాటి ఉదయమే శ్రీరంగనాథుని సందర్శించుకొని అనంతరం తిరుకోటినంబి పాదపద్మాలకు సాష్టాంగ నమస్కారం చేసి మధ్యాహ్న వేళ శ్రీరంగనాథ దేవాలయాని కనతిదూరంలోనే భిక్షాటనకుపక్రమించాడు. ఒకసారి ఆవీధిలో తొందరతొందరగా నడచిపోయే వారందరివైపు పరిశీలగా చూచాడు:

వారందరు ఏదో తరుముకు వస్తున్నట్టు త్వరత్వరగా అంగలు వేసుకుంటూ ఎక్కడెక్కడికో వెళ్లిపోతున్నారు! ఒక్కరు శ్రీ రంగనాథుని దేవాలయ శిఖరంవైపైనా కన్నెత్తి చూడడంలేదు. మరి కొందరు రాజకార్య తత్పరతతో చిక్కి శల్యాలై రాజసేవకు వేళమించిపోతున్నదేమోనని హడావిడిగా పరుగులుపెడుతున్నారు. వారిని చూడగానే రామానుజుని హృదయంలో కులశేఖరాళ్వారుల ముకుందమాలాశ్లోకార్థం కళ్ళకు కట్టినట్టుగా స్ఫురించింది.

"మానవలోకానికంతటికీ మహాప్రభువు శ్రీమన్నారాయణుడే! కేవలం మనస్సు చేతనే ఆ మహాప్రభువును సేవించుకోవచ్చును! దానికి ప్రతిఫలంగా ఆయన తన పరమపదమే అనుగ్రహిస్తున్నాడు. అయినా మంగళస్వరూపుడైన ఆశ్రీమన్నారాయణుని సేవ విడిచి మానవులందరు ఏవో కొన్ని గ్రామాలకధిపతి అయిన ఒక మానవాధముణ్ణి సేవించుకోవడంఅనుక్షణముసతమతమైపోతున్నారు! ఇంతా చేస్తే ఆ మానవాధమునివల్ల ఈ మానవులకు ఒరిగేది అల్పాల్పమయిన విత్తంమాత్రమే! అయినా వారంతా దానికోసమే అర్రులు చాచుతున్నారు. ఆహా! మానవులెంతటి వ్యర్థులు!"

వెంటనే రామానుజుడు వారి అందరిదగ్గరికీ పరుగెత్తుకుపోయి వారందరికీ శ్రీ రంగనాథుని పాదపద్మాలొక్కమారు చూపించవలెనని అనుకొన్నాడు:

"నాయనలారా! కట్టెదుట మెరిసేస్వామి శ్రీ పాదసన్నిధి ఎన్నటికీ తరగని ఒక పెద్ద పెన్నిధి! మీరందరు నిరంతర దుఃఖభూయిష్ఠమైన ఈ మహాసంసార తాపత్రయంలో పడి ఎందుకింతగా కొట్టుమిట్టాడి పోతున్నారు! రండి! శ్రీరంగనాథుని శ్రీపాదసన్నిధికి రండి! తరించండి!"

అని అందరికీ వినబడేటట్టు గా, గుడిగంటలు మారుమోగేటట్టుగా గట్టిగా కేకలు పెట్టవలెనని అనుకున్నాడు. ఒకరిద్దరిని తనతో కలిసి స్వామిసన్నిధికి రావలిసిందనికూడా ప్రార్థించాడు.

కాని వారందరు ఆధోరణి చూచి, అతనికి పూర్తిగా మతిపోయినదనే అనుకొన్నారు. ఒకరిమొహాలొకరు చూచుకుంటూ చల్లచల్లగా తమ ఇళ్లకు వెళ్ళిపోయారు.

రామానుజుని దృష్టి మరొకవైపు తిరిగింది. అక్కడ అతనికి కనిపించినవారందరు కేవలం గర్భదరిద్రులు. కొందరు వికలాంగులు. మరి కొందరు వికల మనస్కులు. మరి కొందరస్పృశ్యులు; వెలివాడవారు.

రామానుజునికి వారందరిలోను శ్రీరంగనాథుని పాదపద్మ ముద్రలు గోచరించాయి. వెంటనే వారందరిపాదరేణువులు తన శిరస్సుపై చల్లుకొనవలెనని అతనికి తోచింది.

కాని వారతని నల్లంతదూరంలోనే చూచి దూరదూరంగా తొలగిపోవమ్మను! వారి హృదయాలలో ఎలాంటి పెన్నిధులున్నాయో వారికే తెలియదు!

అతని హృదయం అంతా వారి యాతనా జ్వాలలతో కాలి నుసి అయిపోయింది. అదే క్షణంలో హఠాత్తుగా రామానుజుని కొక ఉపాయం స్ఫురించింది. వెంటనే వెనుదిరిగి తిరుకోటినంబి గృహానికి వెళ్ళిపోయాడు.

## 3

సాయంసంధ్యా సేవలో శ్రీరంగ దేవాలయ ఘంటలు భక్తులందరినీ "రండి! రండి! శ్రీరంగనాథుని సేవకురండి!"

అని గొంతెత్తి పిలుస్తున్నట్టు గంభీరంగా మారుమోగాయి. రామానుజుడు తిరుకోటినంబికి సాష్టాంగనమస్కారంచేసి సవినయంగా దోసిలిఒగ్గి నిలుచున్నాడు. తిరుకోటి అతనివైపు కొంచెం పరిశీలనగా చూచాడు:

"నీమంత్ర పునశ్చరణ యథావిధిగా సాగిపోతూనే ఉన్నదా? నాయనా?"

"తమ కరుణాకటాక్షం వల్లనే!"

అని రామానుజుడలాగే నిలబడి ప్రశ్నించాడు:

"స్వామీ! తాము నాకొక దివ్యమంత్రం

దయ చేయించారు. దానితో నా జన్మ తరించింది."

"అవును! నాయనా! నీవు మహాదృష్ట శాలివి! ఆ మహామంత్రం పునశ్చరణచేసినంత మాత్రాన శ్రీమహావిష్ణుసాయుజ్యం కరతలా మలకం! అయితే నీ వది అత్యంత గోప్యంగా సంరక్షించుకోవాలిసుమా! ఈ విషయంలో నీ వేమాత్రము ఏమరకూడదు!"

"స్వామీ! నే నొకవేళ తమ ఆజ్ఞ అతిక్రమిస్తే——"

"వెర్రివాడా! దీనిలో నా స్వార్థ మేమీ లేదు! దానివల్ల నీవే రౌరవాదినరకాల పాలై పోతావు! జాగ్రత్త!" అని గట్టిగా హెచ్చరించా డాచార్యుడు!

"దానికి కారణం?"

అన్నాడు రామానుజుడు.

"నాయనా! మంత్రోపదేష్టలు శిష్యుల మహాపాపభారమంతా భరించవలెనని అన్నానుకదా! ఆమాట అప్పుడే మరిచి పోయావా? అందుచేతనే నీకది కూడదని శాసించాను. తెలిసిందా?"

"ఒకవేళ ఏవిధమైన పరీక్షాదృష్టీ లేకుండా పదిమందికీ ఇది వెల్లడిస్తే——"

"యుగయుగాంతాలవరకు నీవు రౌరవాది మహానరకాలలోపడి మగ్గిపోవలిసిందే! నీ కప్పటికీ ఇక ఆ మహానరకయాతనలనుండి విముక్తి లభించదు!

"స్వయంతీర్త్వా పరాం స్తారయేత్" అన్నారు పెద్దలు. నా మాట జాగ్రత్తగా మననం చేసుకో! అదీగాక ఎవరికర్మ కెవరు కర్తలు! ముందుగా నీ తరణోపాయం ఆలోచించుకో!"

ఆ మాటలలో రామానుజునికి కొంత ఔచిత్యం కనిపించకపోలేదు. ఆ పైన అతనికిక మార్గాంతరమేమీ గోచరించలేదు. ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు.

తిరిగి ఆచార్యునికి నమస్కరించి ఆయన దగ్గర సెలవు తీసుకుని శ్రీరంగనాథుని సాయంకాల దర్శనానికి బయలుదేరి వెళ్ళి పోయాడు.

దేవాలయంలో స్వామిదర్శనం చేసుకుని మళ్ళీ తిరువీధిలో ప్రవేశించగానే ఆ మసక సంజె వెలుగుల్లో ప్రపంచం అంతా అతనికొక అంధకారకూపంలా కనిపించింది. దేవాలయ పార్శ్వంలో మళ్ళీ అతనికి దీనులు, దరిద్రులు, వికలాంగులు, అస్పృశ్యులు మొదలయిన అభాగ్యులంతా ప్రత్యక్షమయ్యారు. వారి ఆర్తనాదాలతని హృదయకుహరంలో ఛిన్నభిన్నంగా మారుమోగాయి. అతని కెటు చూచినా మానవులందరి ముఖాలలోను, తీరని యాతనాదైన్యమే గోచరించిది. ఉన్నవారు, లేనివారు——అందరు ఆయన దృష్టికొక మహాంధకార మృత్యుకూపంలో పడిపోతున్నట్లే కనిపించారు.

# ★ మంత్రోపదేశం ★

అంతలో దూరదూరాహ్వానాల తీరులలో శ్రీరంగ దేవాలయంలోని కంచు గంటలు గభీర గభీరంగా మంద్ర మంద్రంగా మారుమోగాయి.

ఆ పిలుపులు వినగానే రామానుజుని కొదినులు లందరినీ శ్రీరంగనాథుని పాదసన్నిధికి తోడుకొనిపోవాలని పెద్ద తహ తహ బయలుదేరింది. మళ్ళీ ఆ గంటలు మరింత గంభీరంగా మారుమోగాయి.

రామానుజుని కిక అడుగు సాగలేదు. వారు, వీరు, అనే భేదమేమీ లేకుండా ఆపరిసరాలలో తిరిగే వారినందరినీ గొంతెత్తి పిలిచాడు:

"నాయనా! మీరందరు ఎక్కడికలాగ వెళ్లిపోతున్నారు! రండి! నాలో రండి! మీకందరికీ ఒక పెద్దపెన్నిధి చూపిస్తాను! రండి! రండి!" అని ఒళ్లెరగని ఆవేశంతో గట్టిగా కేకలుపెట్టాడు. పెన్నిధి మాటవిన్న కొందరు పిన్నలు, పెద్దలు అతనివెంటపడ్డారు.

అది చూచిన మరి కొందరా వింత ఏమో గమనించాలనే తహతహతో వారివెంట పడ్డారు. అలాగ అక్కడ ఒక పెద్దగుంపు గుమిగూడింది.

రామానుజుడా పార్శ్వంలో అశ్వత్థ వృక్షానికమర్చిన వేదికపై నిలబడి మరింత గట్టిగా వారినందరినీ గొంతెత్తి పిలిచాడు:

"ఇదే నాదగ్గరఉన్న పెన్నిధి! ఇదిగో! మీరందరు స్వీకరించండి! నేను చిరకాలం గురుశుశ్రూషచేసి ఈ పెన్నిధి సన్నిధి సంపాదించుకొన్నాను."

అని వారందరికీ విస్పష్టంగా వినబడేటట్లుగా తన కాచార్యుడుపదేశించిన అష్టాక్షరీ మహామంత్రం బిగ్గరగా ఉచ్చరించి యథావిధిగా ఉపదేశించాడు. అటుపిమ్మట ఇంకొక రెండుమూడు మారులలాగే బిగ్గరగా ఆమంత్రం పునశ్చరణచేసి అక్కడ ఉన్నవారందరికీ అది ఉపదేశించాడు. అతడంతటితో సంతృప్తిపడలేదు. దేవాలయగోపురంమీదికీ, మంటపంమీదికీ వెళ్ళి మరింత బిగ్గరగా ఆమంత్రం ఉపదేశించారు. ఆవేళ బాగా చీకటిపడేదాకా అతడా మంత్రోపదేశంలో పడి ఇక మిగిలిన ఇతరవిషయాల మాటే పూర్తిగా విస్మరించివేశాడు. అతని హృదయం ఆనాటి రాత్రి మహానంద సాగరమై ఉప్పొంగింది.

క్రమక్రమంగా ఆవార్త శ్రీరంగంలో అంతటా కార్చిచ్చులా వ్యాపించింది. రామానుజుడు బాగా రాత్రిపడేదాకా నగరంలో అంతటా సంచరించి చిట్టచివరి కొక రావిచెట్టు నీడలో విశ్రమించాడు.

మరి కొంతసేపటికి తిరుకోటినంబి అతన్ని వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు.

"ఎంత పనిచేశావు నాయనా! స్వయంగా నీచేతులతోనే నీ ఇంటికి నిప్పంటించుకొన్నావే! అయ్యయ్యో! ఎంతపనిచేశావు!"

అని పరిపరి విధాల అతన్ని చీవాట్లు పెట్టడం మొదలుపెట్టాడు.

రామానుజుడా మాటలకేమీ ప్రత్యుత్తరమీయలేదు. ఆచార్యుని పాదాలకు నమస్కరించి పాదధూళి శిరస్సుపై చల్లుకొన్నాడు.

"స్వామీ! అన్నీ తెలిసే నేను మీ ఆజ్ఞ ధిక్కరించాను. ఏమి చెయ్యను! నేనా దీనుల కష్టాలు చూచి నిర్లిప్తంగా ఉండలేకపోయాను. పోనీయండి! నేనే శాశ్వతంగా రౌరవాదినరకాల పాలయిపోతాను. నామూలంగా వారందరు తరిస్తేనాకదే శ్రీ మహావిష్ణు సాయుజ్యం! వారందరు తరించినప్పుడు శాశ్వతనరకంకూడా నాకు స్వర్గధామమే! నాకదే పదివేలు!"

కరుణార్ద్రమైన రామానుజుని హృదయం ఆక్షణంలో కన్నీరై సంతతధారగా ప్రవహించింది.

ఆమాట విని తిరుకోటినంబి అరగడియ వరకు అలాగే నిశ్చేష్టుడై కూర్చుండి పోయాడు:

"యతీంద్రా! నాకీ క్షణంలో అంతా అవగాహన అయింది! నీవు మానవమాత్రుడవు కావు! ఈవిధంగా ఈ మహామంత్రం సర్వులకు ఉపదేశించే సామర్థ్యము, అధికారము నీకొక్కనికే ఉన్నాయి. నీదృష్టి దివ్యదృష్టి! మాది కేవలం మానవదృష్టి మాత్రమే! ఈక్షణంనించీ నీదర్శనం పతితపావనమై రామానుజ దర్శనమనే నామధేయంతో ప్రపంచంలో అంతటా వర్ధిల్లగలదు."

అని ఆచార్యుడే అతని పాదాలపై సాగిలపడబోయాడు! కాని రామానుజుడది వారించి తానే ఆచార్యుని పాదాలకు తిరిగీ సాష్టాంగ నమస్కారం చేశాడు.

శ్రీ రంగనాథస్వామిదేవాలయ ఘంటా ధ్వానం శ్రీ రంగనగరంలో అంతటా దివ్యాహ్వానంలా మహాగంభీరంగా మంద్ర మంద్రంగా మారుమ్రోగింది. ★




తుమ్మలపల్లి
సీతారామారావు

[గతవారం తరువాయి]

నిద్ర మెల్కొనేటప్పటికి ఏడుగంటలైంది. కిందికి దిగివళ్ళి, ముఖం కడుక్కునివచ్చి కుర్చీలో కూచున్నాను. కాఫీ కప్పు చేత్తోతీసుకున్నాను. బల్లమీద దినపత్రిక కనపడింది. నౌకరు చూస్తుండగా పత్రిక తీసి చదవటం నాకు ఇష్టంలేదు. మొదటి గుక్క కాఫీతాగాను. మొదటి పేజీలోనే పెద్దఅక్షరాలతో కొట్టవచ్చినట్లు ప్రకటించిన ఈ వార్తను అప్రయత్నంగా చూశాను.

“గనుల ఇంజనీరు డాక్టర్ చంద్రశేఖర్ రైల్లోనుంచి పడిపోయి మరణించాడు.”

డాక్టర్ చంద్రశేఖర్ పాశ్చాత్య విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ బిరుదు పొందాడు. స్థానిక నూనెగనుల కంపెనీ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. అంతర్జాతీయ నిపుణుల సమావేశంలో పాల్గొనటానికి వెళుతూ, గతరాత్రి ఎక్స్‌ప్రెస్ రైల్లోనుంచి కాలుజారి క్రిందపడి మరణించాడు.

వీరికి భార్య, ఒక కూతురు ఉన్నారు. డాక్టరు చంద్రశేఖర్ భార్య కోమలం. ఈమె, వివాహానికి పూర్వం శానిటోరియంలో హెడ్ నర్సుగా పనిచేసింది. కుమార్తె కాన్వెంటులో చదువుతూంది.

తొమ్మిదిగంటలకు ఇంకా ఇరవై నిమిషాలు వుండనగా, నా సెక్రటరి నన్ను చూడడానికి ఇంటికి వచ్చాడు. మా కంపెనీ మేనేజింగు డైరెకరు, నన్ను త్వరగా కంపెనీకి రమన్నాడని చెప్పాడు. ఈ వార్త అప్పటికే వాళ్ళందరూ చూశారని నాకు అర్థమైంది. అతని పట్టాకు సంబంధించిన కాగితాలు నాదగ్గర వున్న వాటిని వెంటతీసుకొని వెళ్ళాను. చంద్రశేఖర్ రైల్లోనుంచి పడి మరణించాడనే వార్త విని, అతడు గత సంవత్సరం మన కంపెనీలో ప్రమాదభీమా చేశాడనీ, దానికి సంబంధించిన కాగితాలు తీసుకొని బయలుదేరాలనుకుంటుండగా కబురు వచ్చిందనీ మేనేజింగు డైరెక్టరుతో అన్నాను.

ఆనాటి పని ఎల్లాగో పూర్తి చేశాను. మా కంపెనీ జనరల్ మేనేజరు పాండ్య స్వభావమిదివరకే వర్ణించాను. జనరల్ మేనేజరుకి మేనేజింగు డైరెక్టరుకి చాలా తేడా వుంది. మేనేజింగు డైరెక్టరు యువకుడు. ఆదర్శవాది. పాండ్య సహజంగా లోభి. పరిష్కారాలు చేయటం, పట్టాల సొమ్ము ఇవ్వటం నిర్ణయించే అధికారం పాండ్యకు ఉంది.

ఈవ్యవహారంలో నాకు తెలిసినవిషయాలను మేనేజింగు డైరెక్టరుకు లిఖిత రూపకముగా అందజేయడం నా మొదటిబాధ్యత. డాక్టరు చంద్రశేఖర్‌తో ప్రమాదభీమా విషయము ఎప్పుడు ప్రస్తావించింది, అతని భార్యా, కూతురు ఎలా ప్రతిఘటించిందీ, తరువాత ఇంకొకసారి అతని ఆఫీసుకి వెళ్ళి తిరిగి యీ విషయం ప్రస్తావించి ఏ పద్ధతిమీద అతణ్ని వొప్పించిందీ, ఏ తేదీన ప్రీమియంకు అతని వద్ద చెక్కు తీసుకుని కంపెనీకి పంపిందీ, అన్ని వివరాలు ఫకడ్‌బందీగా రాసి అందజేశాను. జనరల్ మేనేజరుతో వున్న పనిని మాత్రం మామూలు ప్రకారమే జరిపేశాను. అప్పటికి మధ్యాహ్నం అయింది. అప్పటికే కొన్ని టెలిగ్రాములు, టెలిఫోను వార్తలు, పాండ్య పంపిన మనుష్యులు సేకరించిన విషయాలు మాకు అందినవి. పోలీసులు కమలాక్షి వద్దకు వెళ్ళి ఆమెను విచారించారు. కోమలాన్ని కూడా పోలీసులు టెలిఫోన్‌లో పిలిచారు. ఎవరితోనూ టెలిఫోనులో మాట్లాడవద్దని ఆమెను ముందే హెచ్చరించాను. అందువలన ఆమె టెలిఫోనులో ఎవరితోనూ మాట్లాడలేదు. ఆమెను స్వయముగా పరీక్షించటానికి ప్రత్యేకముగా ఒకరిని నియమించారు. భీమా కంపెనీ కోరికమీద ఈవిషయంలో అవసరమైన వాళ్లందరినీ కలుసుకుని, పరీక్ష చేయటానికి ఒక అధికారిని నియోగించారు. అవతల వాళ్ళకు ఏవిధమైన అనుమానం కలుగకుండా వీళ్ళు కొంత రహస్యంగా విచారణ జరిపి, ఆచూకీలు తెలుసుకుంటారు. ఆతరువాత ఇటువంటి విషయంతో సన్నిహిత సంబంధం వుంటుందని అనుమానించే వాళ్లని పరీక్ష



# అపరబుద్ధి



చేస్తారు. డాక్టరు చంద్రశేఖర్ గుండె ఆగిపోవటంవల్లగాని, మరి ఇతర సహజమైన కారణాల వల్లగాని, మరణిస్తే, అటువంటి పరిస్థితులలో భీమా కంపెనీకి ఎట్టి బాధ్యతా వుండదు. ఆరోజు సాయంత్రానికి, చంద్రశేఖర్ శవాన్ని పరీక్షచేసిన డాక్టరు దగ్గర నుంచి రిపోర్టు వచ్చింది మెడ విరిగిపోవడం వల్ల మరణం తటస్థించిందని ఆ రిపోర్టులో వుంది. ఈవిషయం తెలియగానే అతడి మరణాన్ని గురించిన విచారణలు జరపటం రెండురోజుల పాటు నిలుపుదల చేశారు.

జనరల్ మేనేజర్ బల్లమీద చంద్రశేఖర్ మరణంపై వచ్చిన కాగితాలు టెలిగ్రాములు రిపోర్టులు, ఒక గుట్టగా పడి వున్నవి. ఈవ్యవహారంలో పాండ్య చాలా చిరాకు పడుతున్నాడు. అతడు పిలవండే, అతడి దగ్గరకు వెళ్లి మాట్లాడటానికి కంపెనీ ఉద్యోగులు, గుమాస్తాలుభయపడుతున్నారు. రైలులో నాపక్కనే కూచుని ప్రయాణం చేసిన వ్యక్తి ట్రంక్ ఫోన్‌లో మేనేజింగు డైరెకరుతో ఈవిషయమై ఏదో మాట్లాడాడట. మేనేజింగ్ డెరెక్టర్ తెలుసుకున్న విషయం ఎవరితోనూ చెప్పలేదు. కాని అప్పటినించి మేనేజింగు డైరెక్టరు కులాసాగాను నిమ్మళు నీరత్తినట్లుగా నిబ్బరంగానూ వుంటున్నాడు.

"ఇది కేవలం ఆత్మహత్య," అని ఒక చీటీ రాసి పాండ్యకు పంపాడు. పాండ్యదాన్ని కూడా తన బల్లమీద వున్న కాగితాల కట్టలో చేర్చాడు. అప్పుడు నేను కూడా జనరల్ మేనేజరు గదిలోనే వున్నాను.

మేనేజింగు డైరెక్టరు ఒకసారి ఆగదిలోకి వచ్చాడు.

"ఇది ఆత్మహత్య అయితే, మన కంపెనీకి బాధ్యతే వుండదు. ప్రమాదంవల్ల అతడు మరణిస్తేనే, మనకు కష్టం. మనం అతడికి ప్రమాద భీమా పట్టా ఇచ్చాము," అన్నాడు పాండ్య.

"ఉహూ," అని మౌనంగా విన్నాడు మేనేజింగు డైరెక్టరు.

"అప్పుడే నేను చాలా ముఖ్యవిషయాలు

(41-వ పేజీ చూడండి)

# వనితా లోకం

## అమ్మా ఓ అణా ఇవ్వవూ

"అమ్మా ఓ అణా ఇవ్వవూ" అన్న మాటమనకి ప్రతి ఇంటా మామూలుగా వినబడుతూనే ఉంటుంది.

సాధారణంగా పిల్లలకు డబ్బంటే చాలా ప్రీతి. దాని విలువ ఉపయోగము తెలియని పిల్లలకు కూడా డబ్బంటే చాలాయిష్టం.

పిల్లలకు సాదరుఖర్చుకు డబ్బులివ్వడము సాధారణంగా తలితండ్రుల ఆదాయాన్ని బట్టి వుంటుంది. సామాన్యంగా తలిదండ్రులు పిల్లలు కోరినంతగా డబ్బులివ్వరు. ఇది కొంత వరకు మంచిదే. ఎక్కువగా ఇచ్చినందువలన పిల్లలనేకములైన దురలవాట్లకు లోనౌతుంటారు. ముఖ్యంగా యీ ఎక్కువగా ఇవ్వడం అనేది పిల్లలసంఖ్య తక్కువగా ఉండి, ఆదాయం ఎక్కువగా వున్న కుటుంబాల్లోనే జరుగుతుంటుంది. సాధారణముగా మనం ఈవిధమైన కుటుంబాల్లోనే పిల్లలు పెంకితనంగా, రౌడీతనంగా ఉండడం చూస్తూ వుంటాం. ఒక్కొక్కప్పుడు ఈవిధంగా పెంచిన పిల్లలే ఆకతాయిలుగా అనగా లోకజ్ఞానం అంటే ఏమిటో తెలీని వాళ్లుగా తయారవుతుంటారు. కాబట్టి పిల్లల ఖర్చులకు డబ్బులివ్వడం అనేదానికి ఒక పరిమితి ఉండాలి.

కొందరు ఎక్కువ డబ్బుండికూడా పిల్లలకు ఒక్క కానీకూడా ఇవ్వరు ఇవ్వకపోవడంవలన కూడా పిల్లలు చాలమటుకు చెడిపోతారు. వారి అవసరాలు తీర్చుకొనుటకు, తలిదండ్రులు ఇవ్వనందువల్ల ఏదో ఒకమార్గం వెతుక్కోక తప్పదు. అందులో తేలికైంది దొంగతనం. ఇంక అక్కడ్నించి మొదలు పెడ్తారు. మొదట తల్లి చాటుగా దాచుకున్న డబ్బుల దగ్గరనుంచి, నాన్న డ్రాయరు సొరుగులోవున్న మనీపర్సుదాకా పోతుంది వారిప్రభావం. ఇదంతా పిల్లల తప్పుగాదు. తలిదండ్రుల తప్పే. కాని ఇది ఇంట్లోఅయితే యేదోవిధంగా సర్దుకపోవచ్చు. కాని పరాయిచోటుకు వెళ్లినపుడు మాత్రం చాల ప్రమాదకరం. మనింట్లో చేసినట్లే అక్కడా చేస్తారు.

మంచి పద్ధ



ఇక పిల్లలు డబ్బు ఖర్చుపెట్టేపద్ధతి వారి వారి అలవాట్లను, అభిప్రాయాలనుబట్టి వుంటుంది. కొందరుపిల్లలు తలిదండ్రులిచ్చిన డబ్బును ఎప్పుడూ తినుబండారాలకే వుపయోగిస్తారు. ఇంట్లో ఎన్ని వున్నా కొట్టుకో హోటలుకో వెళ్ళి కొనుక్కొస్తేనేగాని వారికి తృప్తివుండదు. కొందరు పిల్లలు వారి

పి. ఆర్. దేవి

అలంకారాలకోసం, విలాసాలకోసం ఉపయోగిస్తుంటారు. కొందరు పిల్లలకి (ముఖ్యంగా ఆడపిల్లలైతే) కుట్టంటే చాలా ఇష్టమనుకోండి. తలిదండ్రులిచ్చినది కానియైనా, అణాయైనా దాచి ఒక్కరూపాయో, అర్ధరూపాయో ఐతే ఏదారపు ఉండో లేక, ఏ ఊలో, సూదులో ఈవిధమైన కుట్టుపరికరాలనే కొనుక్కుంటారు. మరికొందరు పిల్లలు వారిఖర్చులకిచ్చిన డబ్బును దానధర్మాలకు, పుస్తకాలకు, స్నేహితులను సంతోషపెట్టుటకై బహుమతుల కొరకు వుపయోగిస్తారు. ఈ విధంగా చేయడం మంచిదే. ఈ విధంగా చేస్తే తలిదండ్రులకూడా ముద్దుగా వుంటుంది. కాని ఈ స్నేహితులను పెంచే చోట మాత్రం తల్లికిష్టంవుండదు. ఎంత సేపటికి అణాకొ్కసుక్కుని నాముందర కూర్చుని తినిపోరా" అంటుంది. కాని ఆ బిడ్డకుమాత్రం స్నేహితులకు పెడ్తేగాని తృప్తివుండదు.

తలిదండ్రులు పిల్లలఖర్చులకు డబ్బిచ్చే టప్పుడు ఖర్చుపద్దు రాయడానికి ఒక చిన్న పుస్తకము (Account Book) ఒక పెన్సిలు కూడా ఇస్తేమంచిది. ఈవిధంగా చేసిన ఎడల పిల్లలు మంచి నాణ్యమైన వస్తువులు కొనేందుకే ప్రయత్నిస్తారు. అనగా ఈపుస్తకంలో బడ్జెటు తయారుచేయడానికి అవకాశము ఉంటుంది. ఎప్పుడైనా ఈ బడ్జెటును తలిదండ్రులు చూచి మెచ్చుకోవాలనే కోరిక వారిలో జనిస్తుంది. ఈవిధంగా చేయడంవల్ల పిల్లలు మంచి నాణ్యమైన వస్తువులను యేరి, దానిఎంతకు కొనవలెను, ఏదికొనాలి అనే విషయాలు-చిన్నతనంనుంచే నేర్చుకుంటారు. పెద్దలయి, వారి భావిజీవితంగూడ ఒక క్రమపద్ధతిలో నడిచేట్లు చూచుకుంటారు.

కాబట్టి పిల్లలకు ఎప్పుడు ఒక క్రమపద్ధతిలో వారి అవసరములకు తగినట్లు డబ్బు ఇస్తూవుండాలి. కాని ఎక్కువగా యివ్వకూడదు. ఇచ్చినందువలన కూడా చాలా చెడువున్నది. కాని బొత్తిగా ఇవ్వనందువలన కూడా చాలా అనర్థాలున్నవి. కాబట్టి అవసరమైన వాటికి కూడా ఒకపరిమితి పెట్టుకొని ఇస్తూవుండాలి. ★



ఉపకరణాల పట్నవాసి. "మీయింటిలో హరికేన్ దీపాలు లేవా" అని ఆశ్చర్యపోతాడు గొప్పకి.

# చుట్టాలొస్తు

ఈ చుట్టాలలో అన్ని రకాలున్నారు. కొం
మంది తాము వచ్చినఇంట్లో పిల్లల్ని చాల
సరదాపడేలాగ కథలు చెప్పి మంచి స్నే
లాడో చనువు చేసుకుంటారు. ఒకాయ
బంధువుల ఇంటికి వెళ్లాడు. ఆరో
ఏదో పండుగవడము చేత ఆయింటి ఇల్లాల
పులిహోర పరమాన్నము చేసే ప్రయత్నములో
ఉంది. వచ్చిన చుట్టానికి కాఫీ కలిపే ప్రయ
త్నంలో పాలకుండ బ్రద్దలయి చేతి వాలుగ
వేళ్ళు బాగా కాలిపోయాయి. ఇ
చూడండి ఒక వంక చెయ్యి భగభగా
మండుతూ ఉంటే మరోవంక పులిహోర కలిపి
అందరికీ వడ్డించవలసిన పరిస్థితిలో ఆ యిల్లా
లికి ఏమీ తోచలేదు. కాని వచ్చిన బంధువు
సహృదయుంగలవాడు. వంటయింట్లోకి వచ్చి

★ అల్లమరాజ

వేడివేడి పులిహోర కలపడంలో సహాయ
పడ్డాడు. తరువాత గరిటతో ఆమె ఎలాగో
వడ్డించగలిగింది. ఇట్టివారు సాధారణంగా
తాము వెళ్ళిన యింటి పరిస్థితినిబట్టి నెయ్యి
చాలా వేయలేదనీ, పాడిఅన్నం పెట్టారనీ,
మామిడిపళ్లు వేయలేదనీ, అనుకోకుండా
సర్దుకుపోతూంటారు. ఇలాంటి చుట్టాలు
పదిమంది ఒక్కసారి వచ్చినా ఆడవాళ్ళకి
ఏమీ ఇబ్బంది ఉండదు. ఇక కొత్తవా
సంగతే మనము అనుకునేది. ఐతే అందరికి

మన భారతదేశం అనాదినుండీ అతిథి పూజకీ ఆదరణకీ పెట్టింది పేరు. అతిథిని దైవ స్వరూపుణ్ణిగా ఎంచి పూజిస్తారు మనదేశంలో. ఇక, బంధుమర్యాద గురించి చెప్పనక్కరలేదు.

అయితే ఒక్క సంగతి.

ఇంటికి చుట్టాలుగాని స్నేహితులుగాని వచ్చినప్పుడు మనం ఎలా సభ్యత పాటిస్తామో ఆ వచ్చినవారుకూడా కొంచెం మంచీచెడ్డా గమ నించాలి. ఇక బంధుమిత్రులని ఆదరించడమనేది కూడా దేశకాల పాత్రోచితంగా ఉంటేనే అట్టే కష్టమనిపించదు. మన పూర్వులకున్న శరీరబలంలో మనకు నూరో వంతులేదు. ఆర్థికంగాకూడా మనం "రాయల కాలంలో సామాన్యులు కూడా గొజ్జంగి నీటితో జలకమాడేవారట" అనుకొని సంతుష్టి పడ వలసిన పరిస్థితిలో ఉన్నాము. నిత్యజీవితావసరా లకే ఎన్నో పాట్లు పడుతూ స్త్రీ సంపాదన కూడా అవసరం అంటున్నారీరోజుల్లో.

సభ్యతలేని చుట్టాల్ని గురించి రాయడం ఎంతయినా అవసరం. ఆడవాళ్ళ ఫాషన్లలో, చీరలరంగుల్లో ఎన్ని రకాలున్నాయో



ఆవిడ కేం తెలుసు? సబ్బుఉందాండి అని అడిగితే సా

# హాయ్...జాగ్రత!

పులిహోర కలపడం చేతనవుతుందా అని సులభంగా వెటకారం చెయ్యవచ్చు. ఆ సందర్భంలో పులిహోర కలపవలసి వచ్చింది. ఎదటివాళ్ళ యింట్లో ఉన్నామన్న సంగతి కొంచెం గుర్తు తెచ్చుకుని మోతాదుమించని సభ్యతను కనపరిచాలి. సహాయంచేసినట్లే. అది సందర్భాన్ని బట్టి ఉంటుంది. ఉదాహరణకి నీటియెద్దడి ఉన్న ఊరిలో చుట్టాల యింటికి వెళ్లినప్పుడు తాగడానికి కాకుండా చల్లగా ఉంటాయని వేసంగిలో కూజాలో పోసుకున్న నీళ్లతో ముఖమూ కాళ్లుచేతులూ సబ్బుతో రుద్ది రుద్ది కడగకుండా ఉంటే ఆ ఇంటి గృహిణికి సహాయపడినట్లే. తాగేనీళ్ళ నానాఅవస్థ పడి తెచ్చుకునే స్థితిలో చెయ్యి కడుగుకుండుట కూడా మంచిదికా

## సర్వమంగళ ★

హాయ్యమనడం అక్కడ భావ్యంగా ఉండదు. ఇలా చెప్పాలంటే యెన్నో ఉన్నాయి. ఇక బంధువర్గంలో చాలా వర్గాలున్నాయని ముందే అనుకున్నాం. చూద్దాం.

### గ్రామోద్ధారకులు

వాళ్ళ పనిమీద, అంటే ఏవ్యాపారాదుల కోసమో వచ్చి చుట్టాలింట్లో మకాం చెయ్యడం. ఈరకం బంధుదైవాలు తరచుపట్నాల్లోంచి పల్లెటూళ్ళకి ఏ సెలవుల్లోనో విడు



ఈ చుట్టం ఆరోగ్యసూత్రాలు బాగా పాటిస్తాడు- "ఈసబ్బు కొత్తదేనా; ఈ తువ్వాళ్లు చాకింటి మడతలేనా" అంటూ.

దల అవుతూ ఉంటారు. వీళ్లు కష్టపడి తెచ్చుకున్న సెలవంతా చుట్టాలఇంట్లో సద్వినియోగం చేశామనుకున్న తర్వాతనే కదులుతారు. వచ్చినపని అవకనో, లేక సెలవుల్ని ప్రకృతిసౌందర్య విలసితాలైన పల్లెపట్టుల్లో గడపాలనో, తిష్టవేశారనుకోండి. ఇక వీళ్లుపెట్టేబాధలు ఇన్నీ అన్నీ కావు. పట్టణవాసులమనే అహంభావములో, బలవంతంగా రుద్దుకొన్న నాగరికతతో కనుపిస్తారు.

ఇలాంటి ఆయన ఒకడు వచ్చాడనుకోండి. ఈ వ్యక్తి మాట్లాడేతీరు ఎలా ఉంటుందంటే, సబ్బుబిళ్ల ఉందా ? అద్దము ఉందా ? మీయింట్లో హరికేన్‌లాంతరు లేదూ? ఏ గోడనో, స్తంభాన్నో, అడుగుతున్నట్టు! ఉంటుందిగాని పరాయి గృహిణిని సౌమ్యముగా అడిగినట్లుండదు. ఈరకంవాళ్ళు అవతలవ్యక్తి మర్యాదా, గౌరవము, పాటించవలసిన అవసరం-లేదనుకుంటారేమోకనుకనే వీళ్ళు ఉన్నన్నాళ్ళూ పరిస్థితుల ప్రోద్బలంవల్ల సహించినా వెళ్ళగానే బ్రతుకుజీవుడా అనిపిస్తుంది, గృహస్థుకి.

### శానిటరీ ఇన్‌స్పెక్టర్‌లు!

మరో మహాశయుడు వచ్చాడనుకోండి.



నానికనుకుంది. దాంతో ఆయన చాకిరేవు పెట్టేశాడు.

# చుట్టాలు వస్తున్నారు జాగ్రత్త

ఈయన వారంరోజులకు తక్కువ ఉండడనుకుందాం. ఈ మహానుభావుడు ఆరోగ్యసూత్రాల్ని బాగా పాటిస్తాడుగాబోలు. ఇక ఈయన విజ్ఞానప్రభావం ఎలాఉంటుందంటే. అబ్బాయ్? ఈ సబ్బు ఎవరూ వాడనిదేనా? చాకలితెచ్చిన తువ్వాలు మడతలు రెండుంటే చాలు అంటాడు. స్నానమయి వంటయింట్లో పీటమీద కూర్చుని ఈ పట్టుపంచె ఎవరూ వాడనిదే గదా అంటూ ఓ ధర్మసందేహం వెలిబుచ్చి భోజనాని కుపక్రమిస్తాడు.

వడ్డించేగృహిణి (రెట్టింపు ఖరీదుతో పళ్లువగైరా కొనుక్కోవలసిన నగరవాసి గదా అనో, లేక సమృద్ధిగా ఉన్నాయనో) వేసే అరటిపళ్ళో పనసతొనలో సగం తినేసి, యిది కడిగారా లేదా అని చెక్ చేస్తూ తింటూఉంటాడు. అల్లాంటప్పుడు ఏమిటీచలాయింపు అనుకోక తప్పదు ఎంత బంధు మర్యాదగల గృహిణికైనా. ఆరోగ్యసూత్రాల్ని ఇంతబాగా ఆచరింపచేస్తూన్న ఈ మర్యాదస్తుడు స్నానంచేశాక ఇంకా అందరూ పోసుకోవలసిన నీళ్ళగాబులో తన బట్టల్ని ముంచేసి ఆరవేస్తే ఆఇంట్లో పిల్లలు తెలియక అవే స్నానంచెయ్యడం, తెలిశాక ఉసూరుమంటూ పిల్లలకు, తల్లి మళ్ళీ నీళ్ళు కాచి పొయ్యడము జరుగుతూఉంటుంది.

కొంతమంది మగవాళ్లు తప్పనిసరిగా భోజనము ఎక్కడేనా చేయవలసివస్తే విధిగా అవసరమైన, తువ్వాలు దువ్వెన సబ్బు వగైరాలు వెంట తీసుకుపోతారు. ఇది చాలా మంచిఅలవాటు. ఇక శుచి శుభ్రతల విషయంలో అట్టే పట్టింపులేని వారయితే ఏదిచ్చినా (హోటల్ భోజనములా) సహించి సంతుష్టిపడతారు. ఒకరకంగా ఈపద్ధతి మంచిదే నేమో!

## సరికి సరి

ఒక బంధుశబ్దవాచ్యుడికి ఒకావిడ వడ్డించవలసిన దుర్గతి పట్టింది. ఈయన పనసకాయకూర మారు వేయించుకుంటూ అన్నాడు. "ఇదిఏమిటీ" అని. ఆంధ్రులలో పనసకాయరుచి ఎరగనివారుండరు. ప్రస్తుతము ఉనికి పట్టణమేఅయినా పనసకాయ రుచి మరచినవాడు కాదు. ఆ ఇల్లాలికి ఒళ్ళుమండి సౌమ్యంగానే "అయ్యా! ఇది పనసకాయపచ్చడి" అంది. దానితో ఆయన ఆశ్చర్యపోయి కూరేకాక పచ్చడి చేస్తారని తెలియదే? అని కొంత నాగరికత వలకబోసి మరికొస్త వేయించుకున్నాడు.

## గంభీరోపన్యాసకులు

మరోరకం. వీళ్లకి భోజనం పూర్తి అయ్యేసరికి, సహస్రనామపూజ చెయ్యవచ్చు. మీ ఇంట్లో వెండికంచాలు లేవా! దగ్గిర మొదలుపెట్టి, దేశ, కాల, భూతభవిష్యద్వర్తమాన కాలాల్లోని, సమస్త విషయాలూ, ఏకరువు పెడుతూ, మాటకి గిన్నెడు నెయ్యీ, విలువైన కాలాన్నీ, వ్యయం చేస్తారు. గృహిణి (లేక ఆ ఇంటి స్త్రీలు) భోజనంవగైరా చెయ్యాలన్న సంగతి వీళ్లకితోచదు. వీరిభోజనం, వార్తా సమీక్షా, అయ్యేసరికి వడ్డించే ఆడవాళ్ల ప్రాణం కడంటుతుంది. కొస్త అరిపేద ఇల్లాలయితే శోషవచ్చి పడిపోవచ్చు కూడా. ఇది అతిశయోక్తి మాత్రం కాదు. అనుభవైకవేద్యం మాత్రమే. ఆకలితో, ఏకటాకీగా, కొన్నిగంటలు నించున్న మూలాన కాళ్లులాగుతూ, బాధపడుతూ ఉంటే, అహో! ఆంధ్రమర్యాద! అతిథిపూజ! ఇదే. అని ఎవరనగలరు! తొందరగా కంఠానికి అడ్డుపడేలా, తినాలనికాదు, అనవసర ప్రసంగాలుమాని, భోజనంమాత్రం, చెయ్యగలిగినంతసేపూ తినవచ్చు. కాని తినకముందూ, తదుపరీ, స్త్రీలు ఎన్నో ఇంటి సర్దుబాట్లు చేయవలసి ఉంటుందనేది గమనించాలి.

## బాతాఖానీకోరు

మరోవర్గంవారు. ఇంటి యజమానురాలికి శుచి శుభ్రతలు కొస్త ఎక్కువగా ఉన్నాయనుకుందాం! అన్ని పనులూ అయ్యేక, రాత్రి ఏ పదకొండు గంటలకో మంచమంటూ కనిపిస్తుందా! అని అలసిన శరీరంతో, కళ్లుమంటలతో వస్తుంది. ఆవిడమంచంమీద వీళ్లుకూర్చుని ఇంటి మగవాళ్లతో బాతాఖానీ వేస్తూ, రాత్రి ఒంటిగంటయినా కదలరు. వాళ్లూ, మీరూ తప్పుకోవాలి అని తమ మగవాళ్లతోగాని, లేవయ్యా! అతిథిస్వరూపా! అక్కడ మేము పడుకోవాలి, అని గాని ఏస్త్రీ చెప్పగలదు!

ఇదిగ్రహస్థితి అనుకోవాలేమో! ఆఇంట్లో ఆడవాళ్లకి వీళ్లున్న చోటుగాక మరోచోటు పడుకునేందుకు లేకపోయినప్పుడు ఎంత అవస్థ!

## బేఖాతరీబాబులు

మరోరకం నీ లెఖ్ఖేమిటి! అన్నట్టుగా, నూతివద్దా, విస్తరివద్దా, చీదేస్తూంటారు. ఆ విస్తరి తియ్యడానికి చాలా జుగుప్సాకరంగా ఉంటుంది. నూటులో ఉన్న (సంకుచిత భావాలుగల చుట్టాలుమాత్రమే) వ్యక్తులు కొందరు చాలా జుగుప్సాకరంగా సంచరిస్తారు. అవన్నీ, అనుల్లేఖ్యాలు. సగంగ్లాసు కొరికేసి కాఫీతాగేవాళ్లు కొందరు, వీళ్లు వచ్చినప్పుడు, గృహిణి, గ్లాసులన్నీ కడిగి, పిమ్మట, పనిమనిషికి వెయ్యాలి, లేకపోతే ఆ ఎంగిలి చింతపండుద్వారా, అన్ని పాత్రలకి వ్యాపింపచేస్తుంది. గనక, పట్టు పంచె తెచ్చుకోడనీ, కొళాయి వద్ద చీదేడనీ, ఒకామె, బంధువుని మందలించవచ్చు ఈ సందర్భంలో.

## మన సబ్బు కాకపోతే

ఇంకోరకం, ఒకాయనవచ్చి, అమ్మాయ్! సబ్బుఉందా! అంటాడు. సరే స్నానం చేస్తాడుగాబోలనుకుని, ఇచ్చి. ఆ అమ్మాయి, వంటలో లీనమవుతుంది. పనంతా అయి సబ్బుతో ముఖం కడుక్కోవడానికి వెడుతుంది. అక్కడ సబ్బూ, దాని తాలూకు పెద్దమనిషీ, కూడా కనిపించరు. కాని తెల్లగా ఉతకబడిన ఆయన ముతకలాల్చీ, నూతిపళ్లెంనిండా సబ్బునురగా చూడగానే, అయ్యో! బట్టకని తెలిస్తే, బట్టలసబ్బే ఇచ్చిఉందునే! అని ఉసూరుమంటుంది.

## భేదబుద్ధిలేదు!

సరే! ఈయన భోజనంసంగతి. చారులో కూడా రెండు గరిటెలకుపైగా నెయ్యి పోస్తేనేగాని లేవడు. ఇలాంటివాళ్లకి (పరాయిచోటమాత్రమే సుష్టుగా, ఫస్టుగా, వేస్టుచెయ్యగలిగిన వీరికి) తమ స్వంతఇంట్లో ఇలా జరగదన్నది అందరికీ విదితమే. పోనీ కష్టసుఖాలూ, ఖరవరలూ తెలియకచేశారంటే, రేషనుబియ్యాల బాధలూ, వస్తువుల ఎద్దడీ, అనుభవిస్తున్నవాళ్లే. నిర్మొగమాటం అయినా మోతాదులో ఉండాలి. ఆహారం పటనయినా, తిన్నంతతిని, విస్తరి, గేదెకట్టు మొదలుగా చేసేవారు కొందరు. పోనీ! వీళ్లకి స్వపరభేదం లేదు. మనఇంట మర్యాద పొందినట్టే (కర్మవశాత్తూ) వాళ్ళఇంటికి మనం వెళ్ళడం జరిగితే (అసలు జరగదులెండి) మర్యాదచేస్తారేమో అంటే అలా చెయ్యరు. మన ఇంట్లో తిన్న, లస్కూరా, ఉండలు, జ్ఞాపకంతెచ్చుకుని అయినా, ఆయన భార్య మన ముఖాన్ని బొట్టుఅయినా పెట్టదు. అనవసరం అని వీళ్ల అభిప్రాయం.

## "నేనూ, నా పిల్లలూ"

ఇంకోవర్గం, పల్లెటూళ్లోని బంధువుల ఇంటికి వస్తాడనుకోండి సతీసుత సమేతంగా. ఈయన పొలం ఆ ఊళ్లో ఉండవచ్చు. ఆ రైతు ఓ ముంజెలకంట్లమో, జొన్నుతేగి సాయో, తెచ్చి ఈనాందారుగారి కుటుంబానికి సమర్పిస్తే, ఆయన, పుత్ర పుత్రికా సంతానానికే, సతీమణికే, ముంజెల మాధుర్యాన్నీ, అవి తినే పద్ధతీ, వివరించి చెప్పుతూ, ఇంటివాళ్ల పిల్లాణ్ని ఒకణ్ని పిలిచి, కొస్త చక్కెర (వంటింట్లోది)

# ★ చుట్టాలు వస్తున్నారు జాగ్రత్త ★

తెప్పించి, అది ముంజెలలో మేళవించి మరీ పిల్లలకు తినిపిస్తూ, కంటమంతా ఖాళీ చేస్తారు. ఇక చూసుకోండి తమాషా, పొద్దున్న, "చుట్టాలకే ఇడ్డెన్లు పెట్టాల"నుకుని ఊరడిల్లిన ఆ ఇంటి పిల్లలు, ఏదీకాని వేళ ముంజెలకోసం పోరుపెడితే ఇంటిఇల్లాలు ఎక్కడతెచ్చి ఇవ్వగలదు! ఎంత భాగ్యశాలిని అయినా వెంటనే సమకూర్చలేదు. ఒకాయన సపోటాపళ్లు తన కొడుక్కి వలిచి తినిపించడం, తాను తినడం చేస్తున్నాడు. ఇంటివాళ్ల పిల్లాడు నాలుగేళ్ల వాడు చూశాడు. ఆ పళ్లకోసం తల్లిని వాడు వేధిస్తే, అసలే చాకిరీ ఎక్కువయిన ఆమె వాణ్ని సరిదీయలేక, చచ్చేలా బాదింది. అలా తినేవాళ్లు, ఏ చెరువుగట్టుమీదనో తింటే బాధఉండదు మరి!

## 'మధుర' స్మృతులు

నా చిన్నతనంలో ఒకాయన, బంధువుకాడు, స్నేహితుడు మా ఇంటికి వస్తూఉండేవాడు. వచ్చినప్పుడల్లా, పిప్పరమెంట్లు, చెల్లాయికీ నాకూ, తెచ్చేవాడు. "చిల్డ్రెన్ గార్డెన్ స్కూల్" అని మమ్మల్ని వేళాకోళంచేస్తూ, ఇచ్చేవారు, అవి మూడు కాల ఖరీదుకిలోపుఅయినా, చిన్ననాటి మధురస్మృతిగా నిలిచిపోవడమేగాక, నాటికీ నేటికీ ఆయన మాకు అతిథే. మా లుకూడా ఆయనచేతి పిప్పరమెంట్లుఅందుకొంటున్నారు. వాళ్ల లేత హృదయాల అభిమానాన్ని ఆ వృద్ధుడు అందుకొంటున్నాడు.

## విమర్శకాగ్రేసరులు

ఒక్కొక్క ఇల్లాలికి తాము వాడేకంచాలూ, మంచాలూ, దువ్వెనా, సబ్బూ వగైరా ఇతరు లుపయోగించడం సహింపరానిదిగా ఉంటుంది. అట్టి పరిస్థితిలో ఆమె బంధువులకోసం ఏర్పాటు చేసిన వస్తువులు ప్రత్యేకించిఉండనేఉంటాయి. కాని వచ్చినవారు అదివాడక ఆమెవాడే మంచాలూ, తలగడలూ కేవలం కుర్చీలుగా, సుఖాసనాలుగా భావించి ఉపయోగిస్తే, దుప్పటిని ఉన్న మట్టిని దులప వచ్చును గాని, మనసులోని, ఏహ్యభావాన్ని దులిపి వెయ్యలేరుగదా! కొంతమంది పీటమీదనుంచిలేచాక, పీటని పైనున్న మట్టికి తక్కువ ఉండదు దులుపుకొని కూర్చోవాలని తోచదు కాబోలు, వారికి. కొందరు కాఫీ, స్ట్రాంగ్‌గా లేదనీ, పాలు తక్కువయాయనీ, స్వంత ఇంట్లోకంటె ఎక్కువ సవాల్ చేస్తూ ఉంటారు.

## హితులూ, సన్నిహితులూ

పైన చెప్పిన వర్గాలన్నీ మన ఇంటో ఉనన్నాళ్ళే బాధింపగలుగుతాయి. కాని వీటి తలదన్నిన రకం ఇంకోటి ఉంది. మన సన్నిహిత బంధువులను కొనే వారిలోనే ఈ వర్గం ఉంటుంది. వీళ్లు తిన్నన్నాళ్ళూ, మస్తుగా తిని, వెళ్ళబోయేముందు వ్యక్తిగతంగా, అనుమానాలు వైషమ్యాలు వచ్చే సూక్తులు చెప్పి మరీపోతారు. ఇది కొంపలు కూల్చే పద్ధతి. తిన్న ఇంటి వాసాలెన్నడం. మా నేస్తురాలొకామె ఉంది. ఆమె ఇంటికిపైన చెప్పిన రకం మహానుభావుడు వచ్చి, పదిరోజులామె చేతి భోజనంతిని, ఆమెఏదో కథరాస్తూ రాస్తూ, వదిలివెళ్లిన కాగితాలలో కొంత భాగమే, ఆమెభర్తకిచూపించి, "తమ్ముడూ! నీ భార్యకి, ఎంతవిప్లవాత్మక భావాలున్నాయో చూడు, ఆమెనిహింసించకు సుమా, నేర్పుగా వారించు. విద్యని ఆమె దుర్వినియోగం చెయ్యకుండా కాపాడడం నీధర్మం, నీమేలుకే చెబుతున్నా", అన్నాడట.

అసలే కోపిష్టి అయిన ఆమెభర్త ఏమన్నాడో తెలియదుగాని ఆమె కథారచన ఆగిపోయింది. తినిపోక, కుటుంబ విషయాల్లో కుట్రలు పన్నగలసమర్థులు కొందరుంటారు. పైన చెప్పిన బంధుశబ్దవాచ్యుడు, స్త్రీవిద్య అంటే, పడని సనాతనుడేమో అంటే, నలుగురు పిల్లలతల్లి అయిన తన భార్యను, ఇంట్లో చదివించి, పరీక్షలకు కట్టించి, పరీక్షలో, తాను స్వయంగా వంట చేసి, ఆమెకు తోడ్పడి, చిన్నప్పుడు చదివించని లోపాన్ని తాను పూర్తిచేశాడు. ఈ విశాలహృదయుడికి, పరాయిగృహిణి రచనాశక్తిపై బాధ బయలుదేరితే ఏమనాలో తెలియకుండా ఉంది. వాళ్ళ కనవసరం, అప్రస్తుతం, ఏదీ ఉండదు. నీభార్య పుట్టినింట్లో ఉన్నప్పుడు పార్కుకు వెళ్ళిందనో, నీ అత్తగారు చిన్నప్పుడు రేడియోలో వేషంవేసిందనో, లేక నాభార్యను, పత్రిక చదవడంకాని, ఉత్తరం రాయడంగాని, చేయనివ్వననో వీళ్లు ప్రబోధం (లేక హెచ్చరిక) చేస్తూఉంటారు.

ఆమెభర్త మూర్ఖుడు అయితే ఆమె అవస్థ వర్ణనాతీతం అనవచ్చునేమో! జాతికి చేదపురుగులైన ఈ వర్గం బంధుకీటకాల్ని గృహావరణలోనికూడా రానివ్వకపోవడమేగృహిణికి, గేస్తుకీ శ్రేయస్కరం.

## 'పచ్చడిమెతుకులు చాలెద్దూ'

ఇక మరొక్కమాట చెప్పాలి. ఇటువంటి వాళ్ళు ఇప్పుడు ఉన్నారా! అని సందేహం వద్దు, ఉన్నారు గనుకనే రాయవలసి వచ్చింది. పైన చెప్పిన విషయాలలో కొంత మరోరకంగానైనా 'బంధుబాధ'పడనిగృహిణులుండడం అరుదు. స్వంతఇంట్లో, భార్య చేతిభోజనమైనా సావకాశంగా తినలేని చుకోనిమగవారూ ఉన్నారు. ఎంతో విజ్ఞానం సంపాదించామనుకుని రచయితలుగా తయారై (స్వంత డబ్బుతో అచ్చయినా సరే) పొరుగింటి భోజనంలో తప్పులెంచే వారూ ఉన్నారు. వీళ్ళు మర్యాద పొందాలనుకుంటారేగాని, మనం వాళ్ల ఇంటికి వెడితేభార్య, "ఎప్పుడూ రానివాళ్లువచ్చారు వంకాయలుకొని (బస్తీలో)కూరవండుతా"నంటే, 'మరేం ఫర్వాలేదు, పెసర పచ్చడి చేద్దూ,' అని ఆమెను బుకాయించి, చేయిస్తారు. వాళ్లు మర్యాద చేయాలనే దే తోచదు. వేస్టుగా, కన్పిస్తుంది వారి ధోరణిలో.

## ఒక్క ముక్క

ఒక్కమాట చెప్పి విరమిస్తాను. ఇల్లయాళ్లకి చుట్టాలూ స్నేహితులూ, రాకూడదనీ, ఉండకూడదనీ కాదు. వారూ రావాలి మనమూ వెళ్లవలసిందే, ఆ వచ్చినప్పుడు తగుమాత్రం సభ్యతను కనపరచి, సహృదయంతో, ఆ ఇంట్లోని పిల్లలను సహితం గౌరవించి, కుటుంబంలోని అందరి మెప్పూ చూరగొని మళ్లీ ఎప్పుడువస్తావు! అనిపించుకోవాలి. అంతేకాదు. మళ్లీ వారిఇంటికి మనం వెడితే, మనల్ని ఆదరించాలి. అలా ఉన్నప్పుడే పరస్పర గౌరవ మర్యాదలు రెండు కుటుంబాల్లోనూ వృద్ధి అయే అవకాశం ఉంటుంది. మరో సంగతి, ఇంటి ఇల్లాలు తనకు ఏమేనత్తగానో, పినతల్లిగానో ఉన్నప్పుడు, సభ్యత ఎక్కువగా పాటించక పోయినా బాధ ఉండదు సన్నిహిత వ్యక్తి కానప్పుడే కొంచెం, పరాయి వ్యక్తి అని గుర్తుకు తెచ్చుకోవలసి ఉంటుంది. స్త్రీలలో చాలామంది ఇలాంటి ఇబ్బందులు పడుతున్నా కుటుంబ పరిస్థితులనుకూలించకనో, వ్రాసేశక్తి లేకనో, గృహ విషయాలికి సంబంధించినదవడం వల్ల పత్రికలకు పంపలేకనో మానేస్తారు. ప్రతిస్త్రీ ఏ కొంచెమయినా ఈ రకం ఇబ్బంది పడకుండా ఉండదనుకుంటా. కాని మర్యాదకు అర్హులైన వారినే మర్యాద చెయ్యడం స్త్రీలూ, ఇట్టివారిని గమనించి ఇంటివరకూ రాకుండా ఊరిపొలిమేరలోనే స్వాగతం చెప్పి, (తప్పనిసరి అయితే) ఏ హోటలులోనో భోజన సదుపాయం చేసి

# పెంకి పెళ్ళాం

౧

కోకా శ్రీ సుధ

(హైదరాబాద్)

"కమ్మా-కథ చెప్పనా" అని అడిగాడు పరమేశం. వంటింట్లోకి వచ్చి కూర్చుంటూ.

ఏడుచేపలా కథా-బ్రహ్మరాక్షసి కథా" అని మోకాళ్ళు దగ్గరగా లాక్కుని గడ్డం మోకాళ్ళ మీద పెట్టి అడిగింది.

"ఛా—ఛా—అవన్నీ పేదరాశి పెద్దమ్మ కథలు, చిన్న పిల్లాడు చెప్పేవి కాదుగా" అన్నాడు పరం.

"ఇంతకీ మీరు చిన్నపిల్లల కోవకు చెంద్తారనా మీ ఉద్దేశం" అని అడిగింది కమల బియ్యంచేటను దగ్గరగా లాక్కుని.

"నీకేమేగాని మా నాయనమ్మకు నేనింకా చితకపిల్లాడినే తెలుసా"

"అని పరంఅనగానే, ఇంకానయంని న్నే పుట్టానన్నారు కాదు. ముందిక్కడ్నుంచి కదలండి వంటిల్లు కడగాలి" అంది కమల లేస్తూ. కాని అతను లేవకుండానే, "ముందు కథ చెప్పనీ ఆతర్వాత ఆలోచిద్దాం" అని ఇంకేమో చెప్పబోతుండగా కమల మధ్యలో అందుకుని.

"కథ అయిపోయిం తర్వాత అప్పలమ్మకు మీరు సాయపడతారా మరి" అంది.

"ఇంకేం నాకథలో మెటీరియల్ కూడా అదే. అలాగే సాయపడ్తా సరేనా" అన్నాడు పరమేశం.

"వద్దుబాబూ మీ నాయనమ్మగారి అక్షింతలు ఇక్కడ వర్షిస్తాయి, వడగళ్లలాగా... బాబూ బతిమాలుకుంటాను. కాస్త వెళ్ళి మీ గదిలో కూర్చోండి" అంది కమల బ్రతిమాలుకుంటూ.

"సరే జాలి దలిచి వదిలిపెడ్తున్నా" అంటూ పరమేశం వంటిల్లుదాటి తన గదిలోకి వెళ్ళి తలుపు గడియపెట్టి, సిగరెట్టు వెలిగించి వారపత్రికను తీసుకుని కుర్చీలో కూర్చున్నాడు.

కమల పనంతా ముగించుకుని కాఫీకప్పు చేత్తో పట్టుకుని తలుపుకొట్టింది. కొట్టిన 5 నిమిషాలకు పరమేశం తలుపు తీశాడు.

ఆతర్వాత కమల లోపలికొచ్చింది.

కమలను చూడగానే పరం

"ఓ అతిలోకసుందరీ నీ సౌందర్యానికివే నా జోహారులు, నీ అతిలోక సుందరహస్తాల మృదుత్వమును చవిమాచిన ఆ కాఫీకప్పు ఎంత ధన్యురాలో కదా" అని ఇంకేమో చెప్పబోతుండగా కమలమధ్యలో అడ్డువచ్చి.

"ఇప్పుడు ఆబల్లక్రిందనున్న సిగరెట్టుతీసి వీధిలో పారవేయకపోతే నాచేతి మృదుత్వాన్ని మీరు కూడా చవి చూడవలసి వస్తుంది" అంది నవ్వుతూ.

"మేష్టారూ—ఇంకెప్పుడూ చేయనండి, బాబోయ్ దెబ్బ తగుల్తుంది సార్, అమ్మోయ్ మాష్టారూ కొట్టకండి, ఇంకెప్పుడూ సిగరెట్లు కాల్చనండి, ఈసారికి వదిలేయండీ, ఇంక కాలుస్తానండీ-సారీ-కాల్చనండి" అని చిన్నపిల్లాడిలాగా గోలచేస్తూంటే వంటింట్లో వున్న అప్పలమ్మ పరుగెత్తుకునివచ్చి, "భలే, వారే బాబూ" అంటూ నవ్వుకుంటూ వెళ్లిపోయింది తన పనిలోకి.

కమలమ్మను చూసి "ఇప్పుడైనా వింటావా నాకథను" అని అడిగాడు పరమేశం నవ్వుతూ పడక కుర్చీలో కూర్చుని.

కమలమ్మ అతని ప్రక్కనే క్రిందకూర్చుని 'ఊ' అంది.

అనగా అనగా - అని ఆగిపోయాడు పరమేశం.

కమల ఏం అన్నట్లు చూసింది.

"మరి 'వూ' అనకపోతే కథనడవదు, 'వూ' అను" అని పరమేశం అన్నాడు గోముగా.

"మీ కథకు కాళ్ళుంటాయి అనుకోలేదు. సరా మామూలే అనుకున్నా-సరే కానీయండి" అంది 'వూ' అంటూ.

"ఒక నాయనమ్మ ఆ నాయనమ్మకో మనవరాలు వుండేదట. బలే పెంకిదట. ఆ అమ్మాయి కొస్తంత పెద్దయినాక ఒక జ్యోతిష్కుడు చూచి, బాబోయ్ ఇదిరణపెంకి. భర్తను కొంగున కట్టుకుని తిరుగుతుంది, అని అనగానే ఆ జ్యోతిష్కుణ్ని ఆ పెంకమ్మాయి, ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువులనీళ్ళు తాగించి తరిమేసిందట..." ఇంక చాలు అని కమల కోపంతో లేచి పోబోయింది.

కాని పరమేశం కమలజడ ఒకచేత్తో అంతకుముందే గట్టిగా పట్టుకుని వుండడంవల్ల లేవలేకపోయింది.

"ఇదిగో కమ్మా నీ వివ్వాళ నాకథను వినాల్సిందే" అని అన్నాడు. కమల బుజాలు పట్టుకుని కూర్చోపెట్టడానికి ప్రయత్నిస్తూ.

"ఆకథ పాత చింతకాయపచ్చడి స్వామీ" అంది కమల విసుగుగా.

"అరే—పాత చింతకాయపచ్చడి ఆరోగ్యంగా నాయనా అంటూ బలవంతాన నానోట్లో పెట్టేది తెలుసా మానాయనమ్మ" అని అన్నాడు పరం సీరియస్‌గా.

"నాకు పనుంది సార్" అంటూ తప్పించుకోబోయింది కమల.

"ఆ పప్పులేం మనదగ్గరుడకవు సారూ! కూర్చోండి" అంటూ బలవంతాన కమలను కూర్చొబెట్టి తనకథను ప్రారంభించాడుపరం.

"కొంతకాలానికి ఆ పెంకమ్మాయి నాయనమ్మ ఇంకో నాయనమ్మ కలిసి గూడుపుఠాని చేసి ఆ "ఇంకో నాయనమ్మ" అర్భకుడైన మనవణ్ని మెపెవంచి మంగళసూత్రం కట్టించేశారట" అనిముగించేశాడు పరమేశం.

కమల విరలబడి నవ్వసాగింది.

"అదేం-అలా నవ్వుతావ్" అని అడిగాడు పరమేశం.

అదే-ఆడపిల్ల మొగవాడి మెళ్ళో మంగళసూత్రం కట్టడమేమిటండీ" అని అంటూ మళ్లా గట్టిగా నవ్వసాగింది.

"అమ్మ పొరబాటు వొర్లింది. పూలదండ వేయించారట, అని చదువుకోవలెను. ఈ పొరబాటును మన్నిస్తారుగదూ! ఇట్లు కథకులు-"అని అన్నాడు పరం తెలివిగా.

"ఇంతకీ కథనెందుకు చెప్పినట్లు, ఎక్కడ సంపాయించినట్లు" అనిఅడిగిందికమలతాపీగా

"మన ఊహా-రేపే రాసి పత్రికకు పంపేస్తాను. అందుకు కావలసిన పరికరాలు, ఓ పెట్టె సిగరెట్లు, మన పెద్ద ఫ్లాస్కు నిండా టీ కావాలి" అని అన్నాడు పరం.

ఇంతేనా ఇంకేమన్నా కావాలా అని అడిగింది కమల.

"అబ్బె-చాలు-దురాశ దుఃఖానికి చేటు అని మన పెద్దలు చెప్పారు తెలుసా" అని అన్నాడు పరం.

"ఉహూ-ఇంతకీ కథ చెప్పింది, సిగరెట్లకూ, టీనీళ్ళకా మహాశయా! లాభం లేదు, మీరు మాత్రం సిగరెట్టు తాగడానికి వీలులేదు" అని కమల లేచి వెళ్లిపోయింది.

పరమేశం ఇంత బ్రహ్మాండమైన ఐడియా పీచుమిఠాయిలాగా కరిగిపోయిందేమిటే అనుకుని "హా చంద్రమతీ నేనేమి చేతును" అని ముఖారి రాగం ఆలాపించాడు. ★

---

వీడ్కోలు చెప్పడం పురుషులూ చేస్తే చాలా వరకు పీడబాధ తగ్గవచ్చు. ఈ సమస్యా పరిష్కారం జరుగవచ్చు. సహృదయులూ, సన్నిహిత బంధువులూ, అయిన వారిని అనాదరం చెయ్యనేవద్దు.

అతిథిపూజా తత్పరమైన ఆంధ్ర దేశంలో ఇలా ఎందుకు రాయవలసి వచ్చిందంటే, వారి అసభ్యత వల్లనే అని మరోమారు చెప్పక తప్పదు. ★

# ఫలహారాలు మనకిచ్చే ఫలాలు

(గతవారం తరువాయి)

రక్తంలో ఇనుము కలవటానికి "సోడియం" అనే పదార్థం తోడు పడుతోంది. ఈ సోడియం లోపిస్తే జలుబు, చెవుడురావటం తిన్నది తొందరగా అరగకపోవటం కలుగుతుంది. ఇది రాకుండా ఉండాలంటే ఆపిలు పళ్ళు, కరిబూజాపళ్ళు, టొమాటో పండ్లు తినటం అవసరం.

కొందరికి నీరసం (నరాలు బలహీనం కావటంవల్ల) మెదడు చురుకుగా పనిచేయ లేకపోవటం, జుట్టు వెంట్రుకలు బాగా ఎదగకపోవటం, మానసిక నిస్త్రాణ వస్తుంటాయి. అంటే వీరిలో "భాస్వరం" (Phosphorus) అవసరమైనంత లేదన్నమాట. ఈ లోపాన్ని భర్తీ చేసుకోటానికి దానిమ్మపండు, వెలగపండు, కిసుమిసుపండు, ఖర్జూర, ఆపిలు పండు తింటే ఎక్కువలాభం కలుగుతుంది.

మొటిమలతో అనేకమంది అవస్థపడతారు. మలబద్ధకం చేయటం, చిన్న చిన్న దెబ్బలు తగిలితే ఒక పట్టున గాయాలు తొందరగామానకపోవటం చాలామందికిఅనుభవం వీళ్ళకి "పొటాసియం" అనే పదార్థం అవసరమన్నమాట. అపుడు ద్రాక్ష, నారింజ, నిమ్మ, అనాస, టొమాటో, ఆల్బకరా పళ్లు తింటే మంచిది.

క్లోరీను అనేవాయువు కూడా ఆరోగ్యానికి అవసరం. ఇది లేకపోతే "పయోరియా" అనే దంతవ్యాధి కలుగుతుంది. ఎముకలు సరిగ్గా కలుసుకోవు. టొమాటో పళ్లు, ఖర్జూర, అరటిపళ్లు తినేవారికి యీ వాయు పదార్థం సమంగా లభిస్తుంది.

## విటమినులు

పైవి ఎంతముఖ్యమో అంతకన్నా ఎక్కువగా విటమినులు మన ఆయురారోగ్యాలకు ముఖ్యం. ఇవి దేహానికి కావాలిసినది చాలా సూక్ష్మంగానే. అయినాకూడా ఆకాస్తానే లోపిస్తే వెంటనే ఆరోగ్యం దెబ్బతింటుంది. ముఖ్యంగా దేహానికి కావాలిసినది "ఎ", "సి", "డి" అనే విటమినులు. ఇంకా "బి-జాతికి చెందిన విటమినులు." బి-విటమిను అనేది ఒక్కటికాదు. బి-1 అనేదాన్ని

భైరవభట్ల లీలాసీతారాం

"థయామిను" అని పిలుస్తారు. ఇంకా కొన్ని పదార్థాలు కలిపి విటను "బి-2 కాంప్లెక్సు" అని పిలుస్తారు.

విటమిను-ఎ అనేది ఎంతో అవసరం దేహానికి. చిన్న వయస్సులోనే కళ్ళజోళ్ళను ఎంతమంది పెట్టటంలేదు ఈ రోజుల్లో? పాతిక ముప్ఫయి ఏళ్లు వయస్సు రావటంతోటే వయస్సు ముదిరినవాళ్ళమాదిరి కనిపించటం, వృద్ధాప్యం కళలుపడటం, యౌవనచ్ఛాయలు అంతరించిపోటం-ఎంతమంది విషయంలో కనిపించటంలేదు?

వీటన్నిటికి ముఖ్య కారణం "విటమిను-ఎ" సమృద్ధిగా దేహానికి అందకపోటం. ఇది "కాడ్," "షార్క్" అనే చేపలనూనెల్లో బాగా లభిస్తుంది. అది త్రాగటానికి మనస్కరించని వాళ్ళు, వాసన సరిపడనివారూ తినాలిసినపళ్ళు ముఖ్యంగా మామిడిపండ్లు, పనస, నారింజ, బొప్పాయి, అరటి, టొమాటో పండ్లు. బొప్పాయి, మామిడిపండ్లలో ఈ విటమిను-"ఏ"-చాలా పుష్కలంగా ఉంది. ఇది పిల్లలకూ, గర్భవతులకు చాలా అవసరం.

## నీరసానికి

ఇక బి-తరగతి విటమినులలో మొదటిది బి-1-దిన్నే "థయామిను" అని కూడా అంటారు. ఇది సమంగా లేనివాళ్లకు నరాల నిస్సత్తువ, కీళ్లవాతం, సంజు, గుండె బలహీనత వస్తుంటాయి. సహజంగా నలుగురు ఐదుగురుపిల్లలుపుట్టటంతోటే స్త్రీలకు గుండెబలహీనత రావటం నూటికి 90 మంది చూస్తున్నాము. డాక్టర్లసలహా అడిగితే "విటమిను-బి కాంప్లెక్సు" బిళ్లలు వాడమంటున్నారు. ఇలా గుండె నీరసించిపోకుండా రక్షించే పళ్లు. మొదటిది బొప్పాయిపండు, తర్వాత అరటి, మామిడి, వెలగ, జామ, ద్రాక్ష, ఖర్జూరపళ్లు. ఈ విటమిను-బి-లోపం మరబియ్యం తినే మన తెలుగువారందరికి సహజంగా కలుగుతూ ఉంటుంది. గోధుమలు ఎక్కువగా వాడేవాళ్ళకు ఈ లోపం ఎక్కువరాదు. ఉదాహరణకి మన దక్షిణాది స్త్రీలకన్నా ఉత్తరాది హిందూస్తానీ దేశంలో స్త్రీలు ఎంత ధృఢంగా బలంగా ఉంటారో చూడండి!

ఇంకా చాలా మందికి నోటిచిగుళ్ళవాయటం, చిగుళ్లలోంచి రక్తం కారటం, గాయాలు, దెబ్బలు తొందరగా మానకపోవటం జరుగుతూ ఉంటుంది. దీనికి ముఖ్యమైన కారణం సి. విటమిను లోపించటం. ఈ సి-విటమిను చాలా తక్కువయితే రక్తస్రావముకూడా పట్టుకుంటుంది. ఇది ఆకుకూరల్లోనూ, పండ్లలోనూ మన కెక్కువగా లభిస్తుంది.

కాని ఆకుకూరలను వండితేనేగాని తినలేము. ఏమాత్రం వేడితగిలినా ఈ సి-విటమిను నశించిపోతుంది. అందుకని ఇది మనకు లభించాలిసింది పండ్లద్వారానే.

పండ్లలోకల్లా మనకు ఎక్కువగా దీన్ని ఇచ్చేవి మామిడిపండ్లు, నారింజ, నిమ్మ, జామపండ్లు. ఉసిరికాయలో విటమిను-సి చాలా అధికంగా ఉంది. రెండు నారింజపళ్లలో ఉన్నంత ఒక్క ఉసిరికాయలో ఉన్నది. అందుకని ఉసిరికాయ పచ్చడి, నోటి చిగుళ్లు వాయటం, నెత్తురు కారటం, రక్తస్రావములాంటి బాధలను పోగొట్టటానికి తోడ్పడుతుంది. ప్రతిరోజూ తినటం కుదరకపోయినా ద్వాదశినాడయినా ఉసిరికాయ పచ్చడిని తప్పకుండా తినమని మన వాళ్ళు ఎందుకు చెప్పారంటారు మరి?

(అయిపోయింది)

ఉత్తరాలు:

# చికిత్స: నివారణ

వ్యాయామంగురించి, జి. సావిత్రిగారు పత్రికలో వ్రాసిన వ్యాసాలు బాగున్నాయి. సరియైన వ్యాయామంవల్ల చాలా రకాల వ్యాధులు నివారించవచ్చును. కొన్ని కేసులలో ఆపరేషన్ చేస్తేనే కాని, కుదరవనుకున్నవి, వ్యాయామాలు, ఆసనాలవల్ల కుదిరినట్లు మనం వింటున్నాం.

అసలు మనదేశం మొత్తంమీద వ్యాయామానికి ప్రోత్సాహం లేదు. వ్యాధి వచ్చిన తరువాత, చికిత్సకోసం అతృతపడేకంటే, రాకుండానే, తగు జాగ్రత్తలు తీసుకోవటం మంచిదికదా! ఇంగ్లండు, అమెరికాదేశాల మీద పోల్చిచూస్తే, ఇండియాలో సగటున ఆయుఃప్రమాణం చాలా తక్కువ. శతాయుష్షు అయిన మానవుడు 30 ఏళ్లు వచ్చేసరికి మృత్యుముఖంలో పడుతున్నాడు. శిశు మరణాలు కూడా విదేశాలతో పోల్చి చూస్తే, ఇక్కడ చాలా ఎక్కువ. ఇందుకు కారణం, దారిద్ర్యం, ప్రజలలో తగినంత ఆరోగ్య శాస్త్రపరిజ్ఞానం లేకపోవడం. ఇప్పుడిప్పుడు కొన్నిచోట్ల వైద్య, విద్యార్థి దళంవారు కొన్ని గ్రామాలకు వెళ్ళి, అక్కడ ప్రదర్శనల ద్వారా, విజ్ఞానాభివృద్ధి కల్గడానికి పాటు పడుతున్నారు. పల్లెలలో వైద్య సదుపాయాలు కలుగచేస్తున్నారు. కాని అనేక లక్షల గ్రామాలున్న మనదేశంలో, ఒకమూల పని జరిగినంత మాత్రాన, తగినంత అభివృద్ధి కన్పడదు.

రోగనిరోధకశక్తి కలగాలంటే, అన్ని విటమినులు శరీరంలో సరిగా వుండేకదా! పళ్లు, పాలు, కూరగాయలు, వీటిలో అన్ని రకాల విటమిన్లు వుంటాయని పుస్తకాలలో రాస్తారుకదా! మనదేశం, ఆర్థికపరిస్థితినిబట్టి చూస్తే, కనీసం రెండుపూట్లా చిక్కటి మజ్జిగ, కూరలు, కడుపునిండా వేసుకు తినే సంసారాలు ఎన్ని వుంటాయి? అందుకని, సామాన్య ప్రజలకి అందుబాటులో వుండే ఆహారంలోనే, మనం తీసుకునే జాగ్రత్తవల్ల వున్న విటమిన్లు పోకుండా, జాగ్రత్తగా వంటచెయ్యడం నేర్చుకోవాలి. గంజి చాలా బలమైనది. కాని మనం ఏం చేస్తున్నాం? అది అంతా వార్చేసి, మిగిలిన పిప్పిని, తింటున్నాం. విటమిను బి. తక్కువైందని ఇంజక్షనులు పుచ్చుకుంటున్నాం. ప్రతివారు పళ్లరసం తాగలేకపోయినా, పెద్ద ఉసిరికాయలు, టొమేటోలు ఇవి వుపయోగించవచ్చు శరీరానికి అవసరమైన ముఖ్య విటమిన్‌లు వాట్లో వున్నాయి. ఇప్పుడు ప్రతివారు విటమిన్‌లు, కాల్షియం మొదలగు వాటి లోపంవల్ల బాధపడుతున్నవారే. తమ వ్యాధులకు కారణాలు ప్రజలకు తెలియవు. పోనీ ఆ డాక్టరు మహాశయులైనా, ప్రజలకి తెలియచేస్తారా అంటే, ఏదో ఆ సమయానికి రెండు ఇంజక్షనులు పొడవడం తాత్కాలికంగా అయిందనిపించడం. సరియైన ఆహార, విహారాలవల్ల చాలా మటుకు వ్యాధులు రాకుండా కాపాడుకోవచ్చు!

ఎ. పార్వతి—ఏలూరు.

* * *

## పెళ్లిళ్లరోజుల్లో

ఇవి పెళ్ళిళ్లు జరిగే రోజులుకదూ! కోకిలలకు వసంత ఋతువలె మన భారత నారీమణులకు (అంటే పనిలేని వారికి మాత్రం) ఆడిపోసుకోవటానికి మంచి ఋతువు.

నేనీమధ్య మాసాన్న వైపు బంధువుల అమ్మాయి పెళ్లికి వెళ్లాను. పెళ్లికి పిల్లవాడి వైపునుండి 100 మంది దాకా ఆడవారొచ్చారు. వారు పెళ్లిచూచి ఆనందించి వధూవరులను ఆశీర్వదించటానికే వచ్చారు అనిపించలేదు.

ఉప్మా నోట్లో పెట్టబుద్ధి కాలేదనీ, అన్నం మెత్తనైందనీ, ఆ ఈడొచ్చిన పిల్లలు ఆవిధంగా తిరుగుతారేంటీ అయినా ఆ పిల్లలు పెళ్లికి రాకపోతే యేం? ఇవీ వారు విడిది ఇంట్లో కూర్చొని చెప్పుకోవటం. ఇక ఎవరైనా ఈ కాలపు అమ్మాయిలు భర్తను విడచి ఉండలేమన్నారా కొంప మునిగిందే. "ఏం సోద్యం అమ్మా మొన్నీమధ్య పెళ్లి యిందో లేదో మొగుడెక్కడుంటే అక్కడుండాలంటుంది. మాకాలంలో నైతే ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టేవరకూ వారిముందు తిరిగే వాళ్లమే కాదు," అంటారు. మళ్ళీ రామాయణం చదువుతుంటే ముసలమ్మలందరూ చుట్టూ చేరుతారా, అప్పుడు మధ్య మధ్యలో బుగ్గన వేలువేసుకొని "సీతమ్మ పతివ్రతామతల్లి. కాబట్టే భర్తను విడచివుండలేక శ్రీరాముల వారితోపాటు అడవులకెళ్ళింది" అంటారు.

మన భారతీయస్త్రీల విషయం ఏవిధంగా చూచినా వెనుకబడే ఉన్నది.

ఫిబ్రవరి '24 తేది మా ఊర్లో ఓట్లు వెయ్యటానికి దగ్గరి ఊళ్ళల్లో ఆడవారు, ఉత్సాహంగానే వచ్చారు. 5 సం॥ క్రిందట నాకు ఓటింగ్ హక్కు లేదు. ఊరికే మా అమ్మ వాళ్ళతో వెళ్లాను. అప్పటికీ ఇప్పటికీ ఆడవారిసంఖ్య చాలా పెరిగింది. ఈసారి వారినంతా చూచేసరికి అమితానందమైంది. మన స్త్రీ జాతి చాలా ముందంజ వేస్తున్నదని. మమ్మంతా ఓటు వేయడానికి వరుసలో నిలువబెట్టారు. అప్పుడు తరహా చూస్తే భలే చిరాకు పుట్టింది.

వెంకమ్మ కూతురు గుణం మంచిదికాదని అత్తవారు తీసుకవెళ్ళటం లేదని ఒకామె, మొన్నీమధ్యే ఎంతో పోరుపెడితే ఈరాళ్ళ వడ్డాణం చేయించారు అని ఒకామె, కోడలు గయ్యాళిదని చెప్పుకొని ఏడ్వటం ఒకామె, ఇవీ, ఏమిటేమిటో చెప్పుకోవటం. నేను ముందు, అంటే నేను ముందని కొందరి కొట్లాట. ఇవి పోలింగ్ ఆఫీస్‌దగ్గర జరిగే సంగతులు. ఎంతైనాపూర్వంకన్నా కొంచెం ఇప్పుడు నయమంటారు చాలా మంది.

మనదేశంలో తండ్రికన్నా తల్లికిఎక్కువ ప్రాముఖ్యమిస్తారు. దేశాన్నికూడా భారతమాత అని చెపుతారు కానీ భారతపిత అని చెప్పరుగదా! స్త్రీకి ఇంత ఉన్నతస్థానమున్న మన దేశంలోనే స్త్రీలు వెనుకబడి ఉన్నారంటే ఎంతో విచారించవలసిన విషయం.

—తారాజనార్దన్ రావు,
సూర్యాపేట.

* * *

## ఆవుపాలు మంచివి

ఆవుపాలు చాలా మంచివి. నాకు ఆరుగురు చెల్లెండ్రు ముగ్గురు తమ్ములూ గలరు. వాళ్ళందరికీ ఆవుపాలే పోశాము. ఏమీ తేడా కనపడలేదు. మా పిల్లలకికూడా ఆవుపాలే వాడేము. ఉదయం ఆరుగంటలు మొదలు సాయంకాలం 6 గంటలవరకూ మా యింటినుండి ఆవుపాలు అందరూ తీసుకొని వెళ్లేవారు. పురిట్లో పిల్లలకికూడా ఆవుపాలు పొయ్యగా అనేకచోట్ల చూశాను. చాలా మట్టుకి ఆవుపాలు త్రాగిన పసివాళ్ళంతా ఆరోగ్యంగానే యున్నారు.

శ్రీమతులు ఎ వి రమణమ్మగారు రాసిన వ్యాసం చదివాను పంతుల సౌభాగ్యలక్ష్మిగారు విజయనగరం, రాసిన, ఆవుపాలు మంచివి కావా? అనే వ్యాసం చదివాను వారి పిల్లలకు ఆవుపాలు పడక పోతే పడకపోవచ్చును నూటికి 70 మంది పిల్లలకు ఆవుపాలు పడతాయి చనుబాలలోనూ, అవుపాలలోనూ పోషకశక్తులు సమానంగా వున్నాయని పరిశోధనచేసిన వైద్యులు చెబుతారు

పిల్లలకి అనారోగ్యంచేస్తే ఆవుపాలు పట్టటంవల్లనేమో? అనే భయం తల్లులకు కలుగడం, డాక్టర్లుకూడా ఏ పాలు పడుతోన్నారని అడిగి, ఆవుపాలు పట్టవద్దు, డబ్బాపాలు పట్టమని చెప్పడం చాలాచోట్ల జరుగుతోంది. డబ్బాపాలు త్రాగే పిల్లలకు మాత్రం ఆరోగ్యం పుష్కలంగా వుంటోందా అంటే అది పూజ్యమే డబ్బాపాలు త్రాగే పిల్లలకు అనారోగ్యం చేస్తే డాక్టరు, అవుపాలు పట్టిచూడండని చెప్పడం కూడా కద్దు.

సీసాతో పోతపాలు త్రాగే పిల్లలకు, అవి ఏ రకం పాలైనా సరే సీసా సర్వకాల సర్వావస్థలయందూ దగ్గరవుండాలి తల్లి కనపడక పోయినా వాళ్ళు ఊరుకుంటారు కాని, సీసా కనపడకపోతే ఊరుకోరు ఇంట్లో వాళ్ళకీ ఇరుగుపొరుగు వాళ్ళకీ శాంతి లేకుండా చేస్తారు అపశేంగా, చంటివాని అక్కగార్లో అన్నగార్లో, ఎవరో ఒకరు సీసా నిండా పాలుపోసి తల్లి వస్తుంటోన్నా అందిస్తారు చంటివాడు కొన్ని పాలుత్రాగి కొన్ని పారబోసి, వీలైతే సీసాకూడా బద్దలు కొట్టి, మళ్ళీ పాలకోసం అరున్నొక్కటో రాగం ఆలాపిస్తారు. చాలాచోట్ల యీ విధంగానే జరుగుతోంది అందుచేతే అనారోగ్యం పసివాళ్ళకి.

పోతపాలు క్రైమప్రకారం పట్టించి పాల సామగ్రి అనగా, సీసా, గ్లాసు, పౌడరు డబ్బా, చెంచా మొదలైనవి కనపడకుండా చెయ్యాలి పోతపాలు పట్టినవెంటనే తల్లి పాలు ఇవ్వడం ముఖ్యం అల్లా యిస్తే పోత పాల దాహం వుండక సక్రమంగా అరుగుతాయని పెద్దలు చెబుతారు

ఆవుపాలు మంచివి కాదు, అన్న మాట తప్పించి, తతిమ్మా విషయాలు, సౌభాగ్యలక్ష్మిగారు రాసిన వాటితో ఏకీభవిస్తాను అనగా, పిల్లలకు పండ్లరసములు పట్టుట, ఉక్కిలిచేసి పెట్టడం, గంజి పట్టడం మొదలైనవన్నీ మంచివే తల్లిదగ్గర పాలు ఎక్కువగా వుండుటకు (ఆల్టోసాగీ) అనే మందు బాగా ఉపయోగిస్తుంది నేనూ నాస్నేహితురాండ్రూ వాడిచూశాము మంచి గుణం కనిపించింది

సౌభాగ్యలక్ష్మిగారు వారి పిల్లలకు నమ్మకమైన ఆవుపాలు 'ఇంట్లోనిపోస్సినా పడతే దన్నారు కావచ్చు కొంతమందికి పడవు కాబోలు, ఆవుపాలుపోసిన బాలలే నాకు చాలామంది ఆరోగ్యంగా కనిపిస్తున్నారు, మీపల్లవానికి ఏ పాలు పడుతోన్నారని అడగడం నాగరికత కాదంటుంది మావదిన శ్యామల

నమ్మకమైన ఆవుపాలు దొరికినఎడల మంచిదేకాని, మద్రాసువంటి పట్నాలలో దొరుకుట దుర్లభము. ఆవుని యింటికి తీసుకు వచ్చి పితుకుతామంటారు. ఆ, ఆవు శీలావ్యాలు బయటపడి నడువలేకుండా వుంటుంది ఒక్క ఆవుకైనా దూడవుండదు చేట పెయ్యను చేతో పట్టుకొని పాలు పితుకుటకు ఓపీనాలేక గోట్టం పుచ్చుకొని, పాలవాడు చక్కా వస్తాడు వాని చేతిలో వున్న పాలకొక్కలో అంతక్రితమే కలిపిపోసిన పౌడరు పాలు వుంటాయి. ఆవు పొదుగుదగ్గర ఆ కొక్కిపెట్టి పాలు పితికినట్లు నటిస్తాడు ఆపాలకు మన

(55-వ పేజీ చూడండి)



"పెళ్లివారింటికి"
(చైనీస్ ఉడ్‌కట్ చిత్రం చావోయెన్‌ఖియెన్)




అప్పుడప్పుడే చీకట్లు మాయమై వెలుతురు వ్యాపిస్తోంది. బయట ఎవరో తలుపు దబదబా బాదారు. సబ్ ఇన్‌స్పెక్టర్ వీరాస్వామి నాయుడు, విసుక్కుంటూ పక్కమీంచి లేచి, వెళ్ళి తలుపు తీశాడు.

"నిప్పంటుకుంది సార్, నిప్పు! వొడ్డిపాళెంలో కాంతింటికి నిప్పంటుకుంది సార్!" అంటూ, హెడ్ కానిస్టేబుల్ ఏడుకొండలు ఎదురయ్యాడు.

'ఇన్స్‌పెక్టరు నాయుడు బద్ధకంగా అరుగుమీద కూలపడుతూ, "ఏ కాంత? కాపుసారా కాంతేనా?" అని ఆవులించి, చిటికేశాడు.

"అవును సార్, అవును."

"ఫైర్ సర్వీసు వాళ్ళకి ఫోన్ చేశావా?"

"చేశాను సార్, చేశాను. వాళ్ళొచ్చేసరికి పూరికొంపకాస్తా కాలి బూడిదైపోయింది సార్! తలుపులు పగలగొట్టి కాలి బొగ్గయిన కాంతనీ కిష్టయ్యనీ బయటికి లాగారు సార్."

"ఏమిటీ? కాంత కాలిపోయిందా?"

"అవును సార్, అవును. కిష్టయ్య కూడా సార్."

"కిష్టయ్యా—ఏ కిష్టయ్య?"

"కిళ్ళీకొట్టు కిష్టయ్య సార్"

"అక్కడెందుకున్నాడు?"

"మరే, మరి—రంగడు జెయిలుకెళ్ళినకాణ్ణుంచి కాంత, కిష్టయ్యకాడుంది సార్"

"అదా సంగతి?" నాయుడు చివుక్కున లేచి, లోపలికెళ్ళి బట్టలు మార్చుకుని, బయటపడ్డాడు. ముందు నాయుడూ, వెనక ఏడుకొండలూ నడుస్తున్నారు.

"మరే, మరి. రాత్రి కిష్టయ్య ఇంట్లో దొంగలుపడ్డారు సార్. దొంగలు!" మరో శుభవార్తని చల్లగా జారవిడిచాడు ఏడుకొండలు.

"ఏంవిఁటీ? కిష్టయ్యింట్లోనా?"

"అవునుసార్. అవును. మేడమీద బీరువా తెరిచి, నగలూ, వెయ్యి రూపాయలు రొక్కం, పట్టుకుపోయారట సార్"

"అలాగా?"

"అవునుసార్, అవును"

ఇద్దరూ వొడ్డిపాళెం చేరుకునేసరికి బాగా తెల్లవారింది. కాంత ఇల్లు ఊరి చివరుంది. కాలినకప్పు కూలి, మొండిగోడలు మాత్రం నిలిచిఉన్నయ్, ఇంటిముందు, కాలిబొగ్గయిన రెండుశవాలు పడుకోపెట్టబడి ఉన్నయ్.

"శవాలు ఎవరివో గుర్తుపట్టారా?" అని, అక్కడ చేరిన జనాన్ని అడిగాడు నాయుడు.

"ఇంకెవరివి? కాంతదీ, కిళ్ళీకొట్టు కిష్టయ్యదీని. సందేహంలేదు" అన్నాడో పెద్దమనిషి.

"ఎలా చెప్పగలరు?"

"అదేవిటండి? ఇల్లు కాంతది. కాబట్టి ఆడశవం కాంతే అయివుండాలి. పోతే తేలవలసింది మగశవం విషయమొక్కటే. కాంతకీ కిష్టయ్యకీ సంబంధం ఉందని ఊళ్ళో చాలమందికి తెలుసు. పైగా కిష్టయ్య వాళ్ళింట్లోలేడు. అదిగో అ వ్రేలిన వుంది చూశారూ ఉంగరం! అది నాకు బాగా గుర్తు. కిష్టయ్య చేతిలో ఉండగాచూచాను. సీతారామయ్యగారుకూడా ఉంగరాన్ని గుర్తుబట్టారు"

"ఏ సీతారామయ్య?"

"ఇంకెవరు? కిష్టయ్య మావగారే"

"అలాగా?" అంటూ, ఎస్. ఐ. నాయుడు శవాలని సమీపించాడు. కిరసనాయిలు వాసన 'గుప్పు' మంది. నాయుడు అక్కడ చేరిన జనాన్ని అవతలికి పంపి శవాలనీ, ఆ పరిసరాలనీ పరీక్షించసాగాడు. శవాలని పోల్చడానికి, ఆ పెద్దమనిషి చెప్పిన ఆధారాలు తప్ప మరేమీ కనిపించలేదు. వొళ్ళంతా కాలి, బొబ్బలెక్కి, పోల్చడానికి వీల్లేని స్థితిలో ఉన్నయ్ శవాలు.

నాయుడు ఏదో ఆలోచించుకుంటూ, లేచి, ఇంట్లోకి నడిచాడు. ఇల్లంతా కాలీ కాలని కప్పుతో, బూడిద బొగ్గులతో నానాభీభత్సంగా తయారైంది. నాయుడు తిన్నగా,

ఎలాగో దారిచేసుకుని దొడ్లోకి నడిచాడు. దొడ్లో ఓమూల రక్తపు మరకలున్న ఓదుడ్డుకర్ర కనిపించింది. నాయుడు దాన్ని చేతికి తీసుకుని పరిశీలించి, భద్రంచేసి, ముందుకి నడుస్తోంటే, మరో మూలవేపు చెట్టు కింద రెండుజతల నల్లగాజులూ, బాగా అరిగి పోయిన మెట్టెలూ కనిపించినయ్. నాయుడు వాటిని చేతికి తీసుకుని, చూచి, జేబులో భద్రంచేసి, దీర్ఘంగా ఆలోచిస్తూ బయటికి నడిచాడు. మరోమాటు శవాలని పరీక్షించి హెడ్‌కానిస్టేబుల్ ఏసుకొండల్ని పిలిచి శవపంచాయితీకి చెయ్యవలసిన ఏర్పాట్లు, చెయ్యించమని చెప్పి, తిన్నగా కిళ్ళీకొట్టు కిష్టయ్య ఇంటివేపు నడిచాడు.

కిష్టయ్యింట్లో ఆడవాళ్లు గోలగా ఏడుస్తున్నారు.

ఎస్. ఐ. నాయుణ్ణి చూడగానే కిష్టయ్య మామ సీతారామయ్య ఎదురొచ్చి "రండి బాబూ, రండి! ఈ అన్యాయం ఎక్కడైనా చూచారా బాబూ? ఇంట్లో పడి దోచుకు పోయింది చాలక, వాడి ప్రాణాలు కూడా తియ్యాలా?" అంటూ అంగలార్చాడు.

నాయుడు సీతారామయ్య చూపిన కుర్చీలో కూలబడుతూ "మీ ఇంట్లో దొంగలు పడ్డ విషయం మీ కెప్పుడు తెలుసుకున్నారు?" అని ప్రశ్నించాడు.

"రాత్రి ఒంటిగంట దాటి ఉంటుంది బాబూ. దొడ్లో ఏదో 'దభీ'మని పడ్డ చప్పుడయితే మెలకువొచ్చింది. చివుక్కునలేచి, తలుపు తెరుచుకుని దొడ్లోకెళ్ళాను. నిచ్చెన కింద పడివుంది. ఎవడో గోడమీంచి అవతల వేపు దూకేశాడు. వెంటనే అల్లుణ్ణి లేపుదామని గబగబా మేడమీద కెళ్ళాను. గది తలుపులు బార్లా తెరిచిఉంది. దీపం వెలుగుతోంది. అల్లుడు పక్కమీద లేడు. బీరువా తలుపులు తెరిచిఉండడం చూచేసరికి గుండె లాగిపోయినయ్. నగలూ, ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చిన వెయ్యి రూపాయలూ, సర్వం దోచుకుపోయారు."

"వెయ్యి రూపాయలూ ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చారా?"

"అవును బాబూ, అవును. కొట్లో సరుకు లేదనీ, మద్రాసెళ్ళి సరుకులు పట్టుకు రావాలనీ, ఇల్లు తాకట్టు పెట్టయినాసరే వెయ్యి రూపాయలు తెప్పించి పెట్టమనీ, ఒంటికాలిమీద నుంచున్నాడు అల్లుడు. ఈమధ్య వాడి ప్రవర్తనేమీ బాగాలేదని బాగా చీవాట్లు పెట్టాను. అప్పణ్ణించీ నాతో మాట్లాడేవాడు కాదు. అలాంటివాడు, అకస్మాత్తుగా దిగొచ్చి, అడిగేసరికి లేదనలేకపోయాను. అల్లుడికి బుద్ధొచ్చి వుంటుందనుకున్నాను. సాయంత్రమే షావుకారు రామయ్యదగ్గర, ఇల్లు తాకట్టుపెట్టి, వెయ్యి రూపాయలూ పట్టుకొచ్చి ఇచ్చాను."

"ఊఁ-తరువాత మీ రేంచేశారు?"

"అల్లుడు పక్కమీద లేకపోయేసరికి, కొంతింటికి వెళ్ళుంటాడనుకున్నాను. రెండు మూడు మాసాలుగా, వీడికీ దానికీ సంబంధం వుందని విన్నాను. రాత్రిళ్ళు అందరూ నిద్రపోయింతరువాత, గోడదూకి కొంతింటికి వెళ్ళేవాడట. వెంటనే ఆడవాళ్ళని లేపి, జాగ్రత్తగా వుండమనిచెప్పి, పక్కింటి అబ్బాయిని తోడుతీసుకుని, కొంతింటికి బయలుదేరాను. తీరా అక్కడికి వెళ్ళేసరికి గుండెలాగిపోయినై. ఇంకేముంది! ఇల్లు తగలబడి పోతోంది. కంగారుగా అరిచేసరికి, నలుగురూ గుమిగూడారు. కాని ఏంలాభం? అప్పటికే అంతా కాలిపోయింది." సీతారామయ్య కన్నీరు కార్చాడు.

"అల్లుడు అర్ధరాత్రప్పుడు లేచి, కొంతింటికి వెళతాడని తెలిసిన వాళ్ళెవరో పొంచుండి ఈపని చేశారు." సీతారామయ్య బరువుగా నిట్టూర్చాడు.

"ఇల్లు కాలుతుండగా మొట్టమొదట చూచింది మీరే నన్నమాట?" నాయుడు సూటిగా సీతారామయ్య కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించాడు.

"అవునుబాబూ. నాతోబాటు పక్కింటి అబ్బాయికూడా వున్నాడు."

"అలాగా?" నాయుడు అదోలా తల పంకించాడు సాలోచనగా.

"మేడమీది గదిలో కిష్టయ్యొక్కడే పడుకునేవాడా?"

"అవునుబాబూ. అమ్మాయి నిండు చూలాలు. మేడెక్కడం దిగడం కూడదని కింది గదిలో వాళ్ళమ్మతోబాటు పడుకుంటోంది.

"సరే, పైకిరండి, నేనోమాటు కిష్టయ్య పడుకునే గదిని చూడాలి."

"అలాగే బాబూ, రండి!"

ఇద్దరూ మేడమీదికినడిచారు. నాయుడు గదినంతా పరిశీలించసాగాడు. కిష్టయ్య పడుకున్న మంచంమీద, దిండుక్రింద ఓచిన్న చీటీ దొరికింది. ఆ చీటిలో ఇలావుంది:

'కిష్టయ్యా!—నీకు నీప్రాణంమీద ఆశ వుంటే, ఈరాత్రి ఊరు మాటుమణిగిన తరువాత, వెయ్యిరూపాయలు పట్టుకుని, నువ్వొక్కడివే బయలుదేరి, ఊరవతల పాడుబడ్డ శివాలయంలో నన్ను కలుసుకోవాలి. నీతోబాటు ఈచీటీనికూడా పట్టుకురావాలి. ఈ విషయం మరెవ్వరికీ తెలియకూడదు. తాత్సారంగానీ, పొరబాటుగానీ, జరిగితే ప్రాణం ఆశవొదులుకోవలసి వొస్తుంది. జాగ్రత్త!'

ఉత్తరం కింద సంతకంలేదు. రాత వంకరటింకరగా, ఎవరో నూక్కాలు పుల్రాళ్లు రాసినట్టుంది. ఉత్తరాని కుపయోగించిన కాయితం కూడా, నూక్కాలు

# ★ పారిపోయిన దొంగ ★

కుర్రాళ్లుపయోగించే, ఎక్సర్ సైజు నోటు బుక్ లోది. నాయుడు ఆ కాయితాన్ని సీతారామయ్యకి చూపి, "చూచారా? ఈ కాయితం గురించి మీ కేమేనా తెలుసా?" అని ప్రశ్నించాడు.

సీతారామయ్య చీటీ చదువుకుని తనకేమీ తెలియదని బిక్క మొహం వేశాడు.

నాయుడు సీతారామయ్యవద్ద సెలవు పుచ్చుకుని, తిన్నగా స్టేషను వేపు నడిచాడు.

నాయుడు స్టేషన్ చేరుకునేసరికి, రౌడీ రంగడు సబ్ జెయిలునుండి తప్పించుకు పారిపోయాడనీ, రెండు రోజులుగా కనిపించడం లేదని, హెడ్ క్వార్టర్సునుండి వర్తమానము వచ్చింది.

"తెలిసింది సార్, తెలిసింది! రంగడే ఈ పని చేసుంటాడు సార్" అని ఎగిరి గంతేశాడు హెడ్ కానిస్టేబుల్ ఏడుకొండలు.

"ఊహూఁ!" నాయుడు అదోలా తల పంకించి, ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు.

జేబులోని కాయితా న్నోమాటు తీసి చూచుకుని "ఆల్ రైట్" అంటూ పైకి లేచాడు.

ఫోర్-నాట్-ఫోర్ ఆశీర్వాదం సైకిలు కోసం పరుగెత్తాడు. నాయుడు సైకిలెక్కి తిన్నగా స్కూలు వేపు పోనిచ్చాడు. దార్లో రహదారి బంగళాముందున్న మర్రిచెట్టుని సమీపించేసరికి నాయుడి బుర్రలో ఏదో తళుక్కున మెరిసింది. వెంటనే సైకిలుకి బ్రేకువేసి దిగి, తిన్నగా మర్రిచెట్టు వేపు నడిచాడు. చెట్టుకింద ఓ చింకిగోనె, ఓ మట్టి మూకుడు మాత్రం కనిపించింది. నాయుడు అక్కడ పక్కన వున్న వాళ్ళని యేదో విచారించి, సైకిలెక్కి తిన్నగా మునిసిపాలిటీ ఆఫీసు వేపు పోనిచ్చాడు. మునిసిపాలిటీ ఆఫీసులో ఏదో దర్యాప్తుచేసి, సైకిల్ని హైస్కూలు వేపు తిప్పాడు. హైస్కూల్లో కూడా ఏదో విచారించి, తిన్నగా స్టేషను చేరుకున్నాడు.

నాయుడు కుర్చీలో కూలబడి "ఏడుకొండలూ!" అని పిలిచాడు అతని ముఖంలో సంతోషరేఖలు తాండవిస్తున్నయ్.

"యస్సార్" ఏడుకొండలు పరుగెత్తుకొచ్చి, ఎటెన్షన్లో నిలబడ్డాడు.

"మన చుట్టుప్రక్కల పల్లెల్లో, ఎక్కడేనా కొత్తగా సారాబట్టీ వెలుస్తుందేమో కాస్త జాగ్రత్తగా కనిపెట్టుండాలి."

అలాగే సార్, అలాగే" ఏడుకొండలు తలెగరేశాడు. నాయుడు సైకిలెక్కి ఇంటివేపు నడిపించాడు.

*　　*　　*

వారంరోజులు గడిచింది. నాయుడు కుర్చీలో కూలబడి ఏదో ఫైలు తిరిగేస్తున్నాడు. ఇంతలో ఫోర్-నాట్-త్రీ అబ్దుల్ రహీం, నల్లంగా బొద్దుగా వున్న ఓ నడివయసు స్త్రీని లాక్కొచ్చి నాయుడుముందు నిలబెట్టాడు.

"మాదీ కళ్లలో ఖారం కొట్టాలనీ సూసింది సార్. దీనీ పప్పల్ ఉడొక్కలేద్ సార్" అని భుజా లెగరేస్తూ, ఆవిడ నెత్తిమీంచి కూరగాయల గంపని క్రిందకి దించాడు. గంపలోంచి నాలుగు పొడుగుపాటి గాజు సీసాల్ని తీసి టేబుల్ మీద పెట్టాడు.

నాయుడు ఆవిడ ముఖంలోకి సూటిగా చూచి ప్రశ్నించాడు. "ఏవూరు నీది?" అని.

"కొండకింది గొల్లపాలెం బాబు" ఆవిడ గజగజలాడుతూ జవాబిచ్చింది.

"నీ పేరు?"

"రాజండి అందరూ గొల్లరాజని పిలుస్తారు బాబూ"

"ఎంత కాలంగా చేస్తున్నా వీ వ్యాపారం?"

"మొన్నటినించేనండి నాయబ్బతోడు. నే నబద్ధం చెప్పనండి. అసలు మా వూళ్ళోయింతకు మునుపు ఎవరూ కాసేవాళ్లు కారండి"

"అలాగా? అయితే కొత్తగా పెట్టారన్న మాట, సారాబట్టీ?"

"నేను కాదు బాబూ. నాయబ్బతోడు"

"అయితే ఎవరు?"

"మరే మన్నా......" రాజమ్మ చెప్పడానికి తటపటాయించింది.

"చెబుతావా? కొట్లో తోయ్యమంటావా?"

"వొద్దుబాబూ, వొద్దు చెబుతా. ఎవురో సాయిబూ, బూబమ్మ బాబు. ఆళ్లదేమో నైజాం దేశమంట. ఆళ్ళు మాఊరొచ్చి వారం రోజులయింది బాబు"

"ఊహుఁ?" నాయుడు అదోలా తలపంకించి, స్వరం తగ్గించి "రాజమ్మా" అని పిలిచాడు.

"బాబూ!"

"నీ కెంతమంది పిల్లలు?"

"నలుగు రండి".

"మీ ఆయ నేం చేస్తాడు?"

"ఏంచేత్తాడు బాబు? రోగిష్టోడు. మంచమెక్కి నాలుగేళ్ళవుతుంది. పాలమ్మి, కూరగాయలమ్మి నేను నాలుగు రాళ్ళు తీసుకుపోతేనే కాబు బువ్వ."

"అయ్యో పాపం!...రాజమ్మా?"

"బాబు."

"నువ్వు పిల్లలుగలదానివి. వాళ్ళెక్కడుంటున్నారో నిజం చెప్పెయ్. నిన్నొది లేస్తాను."

"నిజంగానా బాబూ - అయితే చెబుతా గొల్లపాలెంలో సెరువుగట్టున గోయిందయ్యల్లుంది బాబు. ఆళ్ళ దొడ్లో గుడిసిలో కాపురం వుండారు."

"సరుకు ఆ గుడిసెలోనే దాస్తారా?"

"కాదు బాబు. ఆ గుడసెలో వుంచుకోరంట సరుకు. అక్కడెక్కడో అడివిలో కాస్తారంట. మరెక్కడో దాస్తారంట. సాయిబు మహాగట్టోడులెండి. పోలీసోల్లకి ఓ పట్టాన సిక్కడంట."

"అలాగా? అయితే ఆ కాసేదెక్కడో, దాచే దెక్కడో నీకు తెలీదన్నమాట?"

"తెలీదు బాబు. నాయబ్బతోడు."

"ఊఁహూ!" నాయుడు అదోలా తల పంకించి "ఆ సాయిబు పేరు?" అని ప్రశ్నించాడు.

"కాలేసా బాబూ."

"మంచిది. ఇక నువ్వెళ్ళొచ్చు."

రాజి నాయుడికి నమస్కారంచేసి వెళ్ళిపోయింది. నాయుడు ఆలోచిస్తూ కూచుండిపోయాడు. అతని బుర్ర కేదో మెరుపు

లాంటి ఆలోచన తట్టింది. "ఫోర్-నాట్-ఫోర్" అని పిలిచాడు.

ఆశీర్వాదం పరుగెత్తుకొచ్చాడు.

"కే. డీ. నరిసిగాణ్ణో మా టిలా పిలుచుకురా."

ఆశీర్వాదం నరిసిగాడికోసం వెళ్ళాడు.

ఇంతలో "రంగడు సార్ రంగడు. రౌడీ రంగడు సార్" అంటూ పరుగెత్తుకొచ్చాడు హెడ్ కానిస్టేబుల్ ఏడుకొండలు.

"ఏడీ?" నాయుడు ఆతురతగా ప్రశ్నించాడు.

"మరే, మరి. తూరుపీదిలో సన్యాసి వేషంలో ఇంటింటా అడుక్కుంటున్నాడు సార్. అనుమానం వేసింది. వెంటనే లగెత్తుకొచ్చాను సార్ మీకు చెబుతామని."

"ఏడవలేకపోయ్యావ్?" నాయుడు కోపంగా చూచాడు. ఏడుకొండలు నిజంగానే ఏడుపు ముఖం పెట్టాడు.

"ఊఁ! వెళ్ళండి! వెంటనే వాణ్ణి కాళ్ళూ చేతులూ కట్టి లాక్కురండి" నాయుడు హుకూం జారీచేశాడు.

"అలాగేసార్. అలాగే "ఏడుకొండలూ అబ్దుల్ రహీం లాఠీలు తిప్పుకుంటూ పరుగెత్తారు.

నాయుడు మళ్ళీ ఆలోచనలోపడ్డాడు.

ఏడుకొండల్నీ, అబ్దుల్ రహీమునీ చూచి బిచ్చమడుక్కుంటోన్న సన్యాసి మెల్లగా పక్క సందులోకి జారుకున్నాడు. మన రక్షకభటద్వయం వెంటపడ్డారు. సన్యాసి పరుగెత్తాడు, కాని, నరిశిగాడికోసం వెళ్ళివొస్తోన్న ఆశీర్వాదం ఎదురవడంతో పాపం, సన్యాసి దొరికిపోయాడు. ఏడుకొండలూ, రహీమూ చెరో రెక్క పుచ్చుకుని, సన్యాసిని బరబరా లాక్కొచ్చి, నాయుడిముందు నుంచో పెట్టారు.

"మాదీ కళ్ళల్లో ఖారం సల్లీ తప్పించుక్కోవాలనీ సూసీన్యాడి సార్. దొంగ ఎధ్వా" అంటూ రొప్పసాగాడు ఫోర్-నాట్-త్రీ అబ్దుల్ రహీం.

"అవును సార్. అవును" ఏడుకొండలు వంతపాట పాడాడు.

"నరిశిగాడు ఇంట్లోలేడు సార్. ఇంటికి తాళం వేసుంది" అన్నాడు ఆశీర్వాదం.

సన్యాసి భయం భయంగా నాయుడు వేపు చూచాడు. నాయుడు సన్యాసివేపు పరిశీలనగా చూచి "నీపేరు?" అని ప్రశ్నించాడు.

సన్యాసి 'బె-బె-బే-బే' అని మూగవాడిలా సైగచేశాడు.

"హిద్గోసార్, హిదో" అంటూ, అబ్దుల్ రహీం, నెత్తిమీంచి టోపితీసి, టోపీలోంచి ఓ చిన్న నోటుబుక్ని టేబుల్ మీద పెడుతూ, "ఈడీ జోలెలోంచి కింద పడింది సార్ అగత్తేప్పుడు" అన్నాడు.

నాయుడు నోటుబుక్కుని చేతికి తీసుకుని కాయితాలు తిరగేశాడు. నాయుడు ముఖం విప్పారింది. "ఊఁహూఁ!" అని తల పంకించి, సన్యాసి కళ్ళల్లోకి చూచాడు. సన్యాసి భయంతో గజగజలాడిపోతున్నాడు. "వీణ్ణి కొట్లో కొట్టండి" అని హుకూం జారీచేసి నాయుడు పైకిలేచాడు.

*　*　*

ఆ సాయంత్రం గొల్లపాలెంలో ఎవరో ముగ్గురు ఫకీర్లు ఇంటింటా అడుక్కుంటూ గోవిందయ్య ఇంటిదొడ్లో కాపురముంటున్న కాలేషా ఇంటి కొచ్చారు. ఆయింటి ఇల్లాలు "పోయిరండయ్యా పోయిరండి" అని గొంతిచ్చింది. ఇంతలో ఎవరో అక్కడికొచ్చి, మంచంమీద కూచుని మేకపిల్లతో చెలగాట మాడుతోన్న కాలేషాతో, రహస్యంగా ఏదో చెప్పి వెళ్ళాడు. కాలేషా కంగారుగా లేచి గుడిసెలో కెళ్ళాడు.

ఆ రాత్రి ఫకీర్లు ముగ్గురూ, గోవిందయ్య ఇంటి పక్కన వేపచెట్టుకింద మకాం వేశారు.

రాత్రి ఊరు బాగా మాటుమణిగింది. కాలేషా, అతనిభార్య, ఇద్దరూ మూటాముల్లే సర్దుకుని చీకట్లో నక్కినక్కి నడుస్తున్నారు. ఇంతలో "ఆగండి కదిలితే కాల్చేస్తాను" అని ఘర్జించిందో గొంతుక. ఇద్దరూ ఆగిపోయారు.

"ఏడుకొండలూ!"

"యస్సార్" చీకట్లోంచి పరుగెత్తుకొచ్చాడు ఏడుకొండలు.

"ఫోర్-నాట్-త్రీ"

"హాజర్ సార్" ఎగిరి గంతేశాడు అబ్దుల్ రహీం.

"వీళ్ళిద్దరికీ బేడీలు తగిలించండి"

"అలాగేసార్. అలాగే"

ఇద్దరి చేతులకీ బేడీలు పడ్డయ్.

"నీ పేరు?" నాయుడు 'సాయిబు కళ్ళ

# ★ పారిపోయిన దొంగ ★

ల్లోకి చూస్తూ ప్రశ్నించాడు ముఖంలో ముఖం పెట్టి.

"కాశేషా"

"ఆవిడపేరూ?"

"కాళీబీ"

"భలే మంచి కాంబినేషన్—మూటా ముల్లె సర్దుకుని ఎక్కడికి పారిపోతున్నారు?"

"ఎక్కడికేనా మరో ఊరు"

"ఏం?"

"కాపుసారా అమ్మడానికి వెళ్ళిన గొల్ల రాజిని పోలీసోళ్ళు పట్టుకున్నారని తెలిసింది"

"ఏం తెలిస్తే"?

"రాజీ మాగురించి చెప్పేతుంటుంది. మమ్మల్ని పోలీసోళ్లు పట్టుకుంటారని భయపడ్డాం."

"పోలీసులు పట్టుకుంటే తల తీస్తారా? జరిమానా వేసి వొదిలేస్తారు. ఆ మాత్రానికే ఊరొదిలి వెళ్లి పోతారా."

సాయిబు పలకలేదు.

"నిజంచెప్పు నీపేరు కాశేషాయేనా?"

"అవును"

"ఊహూ!" నాయుడు వ్యంగ్యంగా తలూపి "ఏడుకొండలూ వీడి గడ్డం లాగెయ్" అన్నాడు.

"అలాగే సార్, అలాగే" అంటూ ఏడుకొండలు సాయిబు గడ్డం పుచ్చుకున్నాడు. గడ్డం తినంతటదే ఊడొచ్చింది. ఏడుకొండలు అతడి ముఖంలో ముఖంపెట్టి "అరే కిష్టయ్య సార్" అని ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"ఫోర్-నాట్-త్రీ. బూబమ్మ సెత్తిన ముసుగు తియ్" అబ్దుల్ రహీమ్ చేతిలోని లాఠీతో ముసుగు లాగేసి "అరే ఇస్కీ కాంతా థె కాంతా" అని ఎగిరి గంతేశాడు ఆశ్చర్యంగా.

ఏడుకొండలు అనుమానంగా వాళ్ళవేపు చూస్తూ "మరే మరి వీళ్ళు...వీళ్ళు..." నసుగుతున్నాడు.

"దయ్యాలుకావు మనుషులే"

"హత్తేరి"అని ఎగిరి గంతేశాడు 'దయ్యం' శబ్దం వినగానే ఫోర్-నాట్-త్రీ అబ్దుల్ రహీం.

"మరే మరి వీళ్ళు చావలేదా సార్?" ఏడుకొండలు కొత్త ధైర్యం చిక్కబట్టుకుని ప్రశ్నించాడు.

"ఇంతవరకు చచ్చినవాళ్ళెవరూ బ్రతకలేదు"

"మరి కాలిపోయిం దెవరు సార్?"

"సబ్ జెయిల్లోంచి తప్పించుకొచ్చిన కాడీ రంగడూ, రహదారి బంగళాకెదురుగా మర్రిచెట్టు కింద జబ్బుతో తీసుకుంటోన్న బిచ్చగత్తెను"

"ఏఁవిఁటీ?" ఏడుకొండలు ఆశ్చర్యంగా గుడ్లెల బెట్టాడు. కిల్ళి కొట్టు కిష్టయ్యకీ, కాపుసారా కాంతకి గుండెల్లో గుర్రాలు పరుగెడుతున్నయ్.

"అసలెలా జరిగిందో చెబుతో నడవండి"

ఏడుకొండలూ, అబ్దుల్ రహీం కాంతనీ, కిష్టయ్యనీ చెరోరెక్క పుచ్చుకుని నడుస్తున్నారు.

నాయుడిలా చెప్పసాగాడు: "రంగడు సబ్ జెయిల్లోంచి తప్పించుకుని తిన్నగా కాంతిల్లు చేరుకున్నాడు. కాంతంటే వాడికి ప్రాణం. మనం ఎక్కడికేనా వెళ్ళి పోదాం రమ్మని పిలిచాడు. తాను జెయిలు కెళ్ళింతరువాత, కాంతకిష్టయ్య ప్రాపకంలో వున్న విషయం రంగడికి తెలీదు. కాంత రంగణ్ణి యింట్లో దాచి, కిష్టయ్యని కలుసుకుంది. కాంతా, కిష్టయ్య కలిసి ఆలోచించారు. రంగణ్ణి పోలీసులికి వొప్పజెపితే తాత్కాలికంగా వాడి బాధ తప్పుతుంది కాని, జెయిల్లోంచి విముక్తలయిం తరువాత వాడు తమ్మ ప్రాణాలతో వొదలిపెట్టడు, అంచేత రంగణ్ణి ఎలాగయినా హతమార్చి తామెక్కడికేనా పారిపోవాలని నిశ్చయించుకున్నారు. ఆ సాయంత్రం కొట్టులో ఖరుఖు లేవని మామతో తగూలాడి, ఇంటిని తాకట్టు పెట్టించి, వెయ్యిరూపాయలు తీసుకున్నాడు కిష్టయ్య. రంగడికి బాగా సారాపోయించి, వాడు వొళ్ళు తెలీని స్థితిలో వుండగా యిద్దరూ చేరి వాణ్ణి హతమార్చారు. ఆ సాయంత్రమే రహదారి బంగాళాముందు, మర్రిచెట్టుకింద చచ్చిపోయిన బిచ్చగత్తెను తీసుకొచ్చి, రంగడిపక్కన పడుకోబెట్టి, చచ్చిం దెవరో తెలుసుకునేందుకు వీల్లేకుండా వుండేందుకు, మీద కిరసనాయిలు చల్లి తగలబెట్టారు. తరువాత ఇంటికూడా నిప్పంటించారు. తిన్నగా కిష్టయ్యింటికొచ్చి బీరువాలోని నగలూ, వెయ్యిరూపాయలూ తీసుకుని, అందరూ దొంగలు దోచుకుపోయారని పారబడేందుకు వెళుతూ వెళుతూ నిశ్చిన కిందతోసి కిష్టయ్య తన మామని లేపి, పారిపోయాడు. అంత క్రితమే తయారుగా వుంచుకున్న సాయిబూ, బూబమ్మల వేషాలు ధరించి రాత్రికి రాత్రి బయలుదేరి, ఈవూరు చేరుకున్నారు. ఈ వూరు కొండక్రింద వుండడంవల్ల పోలీసులు అనుమానించినా తప్పించుకునేందుకు అనువుగా ఉంటుందనుకున్నారు."

"అరే, ఇస్కీ ఎంతొపనీ సేసీన్యార్ రే" అబ్దుల్ రహీం ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"మరే, మరి. ఇదంతా ఎలా కనిపెట్టారు సార్?" ఏడుకొండలు తలగోక్కుంటూ ప్రశ్నించాడు.

నాయుడు సన్నగా నవ్వి ఇలా చెప్పసాగాడు:

"నేను సరాసరి శవాలవద్ద కొచ్చేసరికి గుప్పుమని కిరసనాయిలు వాసనేసింది. దొడ్లో వెతుకుతోండగా రక్తపు మరకలున్న దుడ్డుకర్ర దొరికింది. వాటిని బట్టి, ఎవరో ముందుగా ప్లాను వేసుకుని వాళ్ళిద్దర్నీ హతమార్చి, తరువాత శవాలెవరివో తెలియకుండేందుకు మీద కిరసనాయిలుచల్లి నిప్పంటించి వుంటారని వూహించుకున్నాను. కాంత ఇంట్లో, కాంత సాయం లేకుండా ఎవరూ ఎలాంటి ప్లానూ వెయ్యలేరు. కాబట్టి ఆడశవం కాంతదికాకపోవచ్చు. మరెవరిదైనా అయి వుండొచ్చునుకుంటుండగా, వేపచెట్టు క్రింద నల్లగాజులూ, కాలిమెట్టెలూ కనిపించినై. కాంత వితంతువు. కాంత ఇంటి దొడ్లోకి పునిస్త్రీలు తొడిగే నల్లగాజులూ, కాలిమెట్టెలూ ఎలాగొచ్చాయి? అని ప్రశ్నించుకుంటే, అవి ఆ యాడశవానివై యుండవచ్చునా కూడదా, అన్న జవాబు దొరికింది. అవును. శవం చేతుల్లో గాజులూ, కాళ్లల్లో మెట్టెలూ వుంటే చూచినవాళ్లెవరూ ఆ శవం కాంతదని పొరబడేందుకు వీల్లేదు.

(56-వ పేజీ చూడండి)

# అపరబుద్ధి

తెలుసుకున్నాను. వాటివల్ల సంఘటనను ఒక పద్ధతిలో మనం అర్థం చేసుకోవచ్చు. ఆయన మొదట ఈ పట్టా తీసుకున్నాడు. అయితే విషయం రహస్యంగా వుంచాడు. ఆయన తన భార్యకుగాని, కూతురికిగాని, చివరకు తన సెక్రటరీకిగాని ఈ సంగతి తెలియపరచకుండా దాచాడు. నిజంగా కృష్ణమోహన్ హుషారుగా వుంటే ఈ విషయం అతడికి తేలిసేదే," అన్నాడు పాండ్య.

"ఎట్లా తెలిసేది?" అని ప్రశ్నించాను.

"నీవు ఆవేశ పడవద్దు. ఈ సందర్భంలో అసలు విషయం నీవు తెలుసుకోనక పోవటం ఆశ్చర్యంగానే వుంది."

"ఇందులో నాకేమీ ఆశ్చర్యం కలగటం లేదు. ఇది అనుభవంలో ప్రతినిత్యంజరిగేదే; అతడికి తెలియకుండా అతడిచేతభీమాచేయిస్తే అప్పుడు ఆశ్చర్యపడాలి," అన్నాను.

"ఔను! అది నిజముగానే వుంది. ఇందులో మన ఏజంటు కృష్ణమోహన్ ప్రసక్తి అనవసరం," అన్నాడు మేనేజింగు డైరెక్టరు.

"నేను చెబుతూంది డా॥ చంద్రశేఖర్ భార్యనుగురించి," అన్నాడు పాండ్య.

"అసలు ఆశ్చర్యకరమైన అంశం ఏదైనా వుంటే అది మన కృష్ణమోహన్ రిపోర్టులో వుండేది. అప్పుడు మనకు తెలిసేది. మనం నియమించిన ప్రత్యేక అధికారుల రిపోర్టుల వల్ల కొత్త విషయాలు బయటపడాలి," అన్నాడు మేనేజింగు డైరెక్టరు!

కొంచెంసేపు ఆగి:

"అయితే, మీరు దీన్ని ఎలా సమన్వయిస్తారు?" అని ప్రశ్నించారు మేనేజింగు డైరెక్టరు.

"అతడు ప్రమాదభీమా పట్టాను రహస్యంగా తీసుకున్నాడు. దీన్ని రహస్యంగా ఉంచవలసిన అవసరం ఏమిటి? ప్రమాద భీమా పట్టాసంగతి ఇంట్లో వాళ్ళందరికీ తెలిస్తే, దీనివల్ల ఆయన తలపెట్టిన పనివాళ్ళకి అర్థమౌతుంది. ఆయనమనసులోవున్న ఆరాటం ఆందోళన వాళ్ళకి తెలిసిపోతుంది. ఆ పుస్తకాలు, రికార్డులు, చరిత్రమనం తెలుసుకుంటే, ఈ ఆధారాన్ని మనంకూడా నమ్మవచ్చు. అప్పుడు ఆయన ఆందోళనకు హేతువు స్థిరపడుతుంది. మరొక ముఖ్యమైనఅంశం. ఆయనకు కాలువిరిగింది. కాలువిరిగినందుకు ఆయన ఎందుకు కంపెనీవద్ద పరిహారం కోరలేదు? ఇది ఆశ్చర్యంగా లేదా? ఆయన ప్రమాద భీమాచేశాడు. కాలువిరిగి ఆయనకు ప్రమాదం తటస్థించినపుడు, పరిహారంకోసం భీమాకంపెనీకి ఎందుకురాయడు? ప్రమాద భీమాపట్టా తీసుకొన్నతరువాతే ముందు



# అపరబుద్ధి



తనని ఆయన నిర్ణయించుకొని వుంటాడు. అందువల్ల కాలువిరిగినప్పుడు కంపెనీకి తరి కోరానికి వ్రాస్తే, తనకు ప్రమాదభీమా వట్టా వుందనే విషయం కార్యకు, మా తు రికి తెలుస్తుందనీ, తాను చేయదలచుకొన్న పనికి అది ప్రతిబంధకమౌతుందనీ ఆయన ప్రమాద భీమావిషయం ఎవరికీ తెలియకుండా అతి రహస్యంగా వుంచాడు."

"ఎలా ప్రతిబంధకమౌతుంది?"

"కాలువిరిగిందని రాయగానే, మన కంపెనీడాక్టరు వెళ్ళి పరీక్షచేస్తాడు. మనకు ఆ వార్త విషయం తెలుస్తుంది. అప్పుడు వెంటనే అతడిపట్టా రద్దుచేసి జమకట్టని ప్రీమియంను అతడికి తిరిగి పంపేస్తాము."

"తరువాత...?" అన్నాడు మేనేజింగ్ డైరెక్టర్.

"అతడు రైలుమీద ప్రయాణం చేయటానికి కాలువిరగటం ఒకవంకగా దొరికింది. ఆయన తనభార్యను రైలుస్టేషన్ వరకు తీసుకువెళ్ళి, రైలులో ఎక్కగానే ఆమెను ఇంటికి పంపించాడు. ఆమెను ఎలాగైనా వొదిలించుకోవాలనుకుని వుంటాడు.

అవతల ప్లాటుఫారంమీద చీకట్లో వొంటరిగా నిలుచుని తనని పరీక్షిస్తున్న ఒక వ్యక్తిని చూశాడు డాక్టరు చంద్రశేఖర్. అందువల్ల తనవెంట ఎవరు రావటంగాని కనీసం ఎక్కువసేపు తనదగ్గర వుండటంగాని అతడికి ఇష్టంలేదన్నమాట. తన జేబులు తడుముకుని టిక్కెట్టుకోసం వెతుక్కుని, కొగితాల సంచిలో తన భార్య పెట్టి వుంటుందని పక్కవాళ్ళతో చెపుతూ ఆ నెపంమీద సామాన్లు వుండే చివరిచోటుకు వెళ్లాడు. ప్లాట్‌ఫారంమీద చంద్రశేఖర్ చర్యను పరిశీలించిన వ్యక్తితోనే, ఇప్పుడు నేను మాట్లాడింది. చంద్రశేఖర్‌తోబాటు రైల్లో ప్రయాణంచేసి, తిరిగివచ్చిన కైలాసనాథ్‌ను కలుసుకున్నాను. ఇతడు పెద్ద వ్యాపారస్తుడు. కాలువిరిగిన కుంటివాడు టిక్కెట్టు వెతకటానికి బయలుదేరటం, కైలాసనాథ్ సహాయం చేస్తానని చెప్పినా అతణ్ణి వారించటం వీటివల్ల డాక్టర్ చంద్రశేఖర్ చర్యను అనుమానించటానికి అవకాశం కలుగుతూంది. ఇది స్పష్టంగా ఆత్మహత్యే. సందేహం లేదు; మరొక అభిప్రాయం కలగటానికి వీలులేదు."

"అయితే ఇప్పుడు మనం ఏంచేయాలి?"

"పూర్తి విచారణ జరగాలని మనం కోరాలి. విచారణలో మనం పాల్గొనకూడదు. ఈ కేసు విచారించే పంచాయతీదారులు, మరణించిన వ్యక్తి భీమాచేశాడని తెలుసుకుంటే, అది మన ప్రాణాలకు చుట్టుకుంటుంది. ఆ సందర్భంలో పర్యవసానం తెలుసుకోటానికి, మన పక్షాన విచారణలు జరిపి, ఆచూకీలు తీసున్నవారిలో ఒకరిని మనం అక్కడికి పంపితే చాలు. అవసరమైతే కైలాసనాథ్ వచ్చి ఆయన చూచిన విషయాన్ని పంచాయతీదారుల ఎదుట విచారణలో స్వయంగా సాక్ష్యం చెపుతానన్నాడు. పంచాయతీదారులు ఇది ఆత్మహత్య అని తీర్పు చెపుతారనడంలో నాకు ఏవిధమైన సందేహమూ లేదు. విచారణలో ప్రత్యక్షంగా పాల్గొంటే మనం చిక్కున బడతాము. మనం అనుసరించవలసిన విధానమేదో ముందుగానే నిర్ణయించుకోవాలి. ఎట్లాగైనా ఒకదాని తరువాత ఇంకొకటిగా కార్యక్రమాన్ని ప్రారంభించాలి. మొట్టమొదట పోలీసులు ఈ కేసులో విచారణ జరిపి ఏ అభిప్రాయాలకి వస్తారో మనం గమనించాలి. వాళ్ళ అభిప్రాయం మనకి అనుకూలంగావుంటే, మొదట్లోనే కేసు మనకు సుముఖంగా పరిణమిస్తుంది."

పాండ్య ఎడతెరిపిలేని ఆలోచనలతో సతమతమౌతున్నాడు. అతని తల వేడెక్కింది. రెండుచేతులతో అతడు తన తల నొక్కుకున్నాడు. ఒక సిగరెట్టు వెలిగించాడు. అతడి ముఖంలో హఠాత్తుగా అసంతృప్తి, నిరుత్సాహం గోచరించినవి.

మళ్ళీ పాండ్య మాట్లాడటం మొదలుపెట్టి:

"ఆత్మహత్యలా ఇది కనపడటంలేదు," అన్నాడు.

"పాండ్య! ఏమిటి నీవనేది? నిస్సందేహంగా ఇది ఆత్మహత్యే," అన్నాడు మేనేజింగు డైరెక్టరు.

పాండ్య తన పక్కనవున్న పుస్తకాల బీరువా తెరిచాడు. కొన్ని పుస్తకాలుతీసి బల్లమీద పడేశాడు.

"ఈ పుస్తకాలు భీమా పత్రికలనుంచి మరణాల విషయమై విశేష లోకానుభవంతో తయారుచేసినవి. నేను వీటి నన్నిటిని శ్రద్ధగా చదివాను. వీటిలో ఒక పుస్తకంలో ఆత్మహత్యను గురించి ఇలా వుంది: అసలు ఆత్మహత్య, ఒక జాతి స్వభావం. ఆ మనిషి రంగు, అతడి వృత్తి, స్త్రీపురుష విభేదం, పరిసరాలు, ఋతుప్రభావం, జరిగిన వేళ మొదలైన విషయాలమీద ఆత్మహత్య ఆధారపడివుంటుంది. ఆత్మహత్య జరిగే పద్ధతులను చెపుతూ ఇవి అనేకమార్గాలలో జరగవచ్చునని గ్రంథకారుడు శాస్త్రవిహితంగా రాశాడు. విషాలు, కత్తులు, తుపాకులు మొదలైన ఆయుధాలు, ద్రావకాలు, వాయువులు, నీటిలో దూకటం, ఆత్మహత్యకు కొన్ని సాధనాలుగా నిరూపించడం జరిగింది. విషాలు తీసుకోవటంవల్ల జరిగే ఆత్మహత్యకు కొన్ని ప్రత్యేకలక్షణాలుచెప్పాడు. ఇవి ఆత్మహత్య చేసుకునేవాళ్ళ జాతి, వయసు, సమయంమీద ఆధారపడివుంటవి. ఆత్మహత్యకు సాధారణంగా ఉపయోగించే విషాలు పట్టికల్లో యిలావుంది. సైనైడ్, పాదరసం, ఇంకా ముప్ఫైఆరు విషాలు ఆత్మహత్య చేసుకునేవాళ్ళు ఉపయోగిస్తారు. వీటిలో కొన్ని సాధారణంగా మందులషాపుల్లో దొరకవు. ఇవేగాక వేగంగావెళ్ళే రైళ్లలోనుంచి దూకటం, కారు చక్రాలకింద పడటం, సముద్రంలో ప్రయాణంచేసే స్టీమరులలోనుంచి నీళ్లలోకి దూకటం, మొదలైనవన్నీ కూడా ఆత్మహత్యకు కారణాలు కావచ్చునని చెప్పి వుంది. ఆత్మహత్యకు వేలకొద్ది ఉదాహరణలు ఇచ్చాడు. కాని నడుస్తున్న రైలులోనుంచి దూకటంవల్ల ఆత్మహత్య జరిగిన నిదర్శనం ఒకటైన చెప్పలేదు," అని వివరించాడు.

"అతడిశవం కనపడినచోట రైలు పదిహేనుమైళ్ళ వేగంతో పోతూ వుంటుంది. నిజంగా చావదలచుకున్న వాడెవరన్నా అక్కడ దూకుతాడా?"

"డాక్టర్ చంద్రశేఖర్‌కి మెడ విరిగింది"

"ఇది నేను నమ్మను. అతడు మొగ్గలు వేయటంలో మంచిసాధన చేసినవాడా?"

"మీరు స్థిమితమైన మనసుతో నేను చెప్పేది వినాలి. యాభై వేల రూపాయలకు భీమాచేసిన వ్యక్తి రైలు కట్టమీద ప్రమాదానికి గురియై మరణించటం ఆలోచించవలసిన విషయం. అసలు రైలుకే ప్రమాదం జరిగి, అందువల్ల అతడు మరణిస్తే, అది వేరే సంగతి. అయినప్పటికీ, రైలుకు ప్రమాదం జరగటం, అతడు మరణించటం ఒక యాదృచ్ఛికమైన సంఘటన కావచ్చు. అప్పుడు ఒక బలీయమైన అనుమానం ఏర్పడుతుంది. కాని ఇది ఆత్మహత్య కాదు"

"అయితే ఇది ఎలా జరిగిందని నీ అభిప్రాయం"

"నా అభిప్రాయం స్పష్టంగా కనపడటం లేదూ?"

"హత్య అనేనా?"

"నిస్సందేహంగా."

"పాండ్యా! ఒక నిమిషం ఆగు. ఇలా నిర్ధారణ చేయటానికి ఏమిటి ఆధారం?"

"ఏం లేదు"

"ఏదో ఒక ఆధారం వుండాలి"

"నేను ఇప్పుడే ఏమీ చెప్పలేను. ఇది ఎవరు చేశారోగాని బహు చాకచక్యంతో జరిపారు. అతడి తెలివితేటలు అద్భుతమైనవి. ఊహకు అందటంలేదు. ఏది ఎట్లా వున్నా ఇది హత్య అనటానికి నా మనసు వెనుకాడటం లేదు."

"ఎవరినైనా అనుమానిస్తున్నావా?"

"భీమా పట్టా ప్రతిఫలం పొందేవారిని సందేహించవలసి వస్తూంది."

"ఈ హత్య చేసింది డాక్టరు చంద్రశేఖర్ భార్య అనేనా నీ అభిప్రాయం. ఆమె అప్పుడు రైలులోనైనా లేదుగా?"

"అయితే ఇంకెవరో వుండివుంటారు?"

"బహుశా ఎవరైవుంటారు?"

"నాకు ఎవరూ స్ఫురించటంలేదు."

"ఈ విషయమే తరువాత ఆలోచించాలి."

"ఆలోచించటానికి నా మనసుకు ఏమీ స్ఫురించటంలేదు. నా ఆలోచన భీమా ప్రీమియములు, లోకానుభవమువరకే పరిమితమైంది. ఇది ప్రమాదమూ కాదు, ఆత్మహత్యా కాదు."

"అలాగైతే మనం ఏం చేయాలి?"

"వెంటనే స్ఫురించటంలేదు. ఆలోచించనీయండి."

అరగంటసేపటివరకు పాండ్యా మౌనంగా వున్నాడు. నేనుకూడా మేనేజింగ్ డైరెక్టరు ప్రక్కనే కూచున్నాను. అతడి ఆలోచనకు భంగం కలిగించకుండా మేము ఇద్దరమూ సిగరెట్లు కాలుస్తున్నాము. పాండ్య తనచేతితో బల్లమీద గట్టిగా కొట్టాడు. అతడి ముఖంలో ఏదో కొత్త ఆశ, ఉత్సాహం కనపడ్డవి. పాండ్య మేనేజింగ్ డైరెక్టర్ వైపు చూస్తూ ఇలా అన్నాడు:

"మనకు ఒకటేమార్గం కనబడుతున్నది. ఇది మామూలుగా జరిగే వ్యవహారానికి వ్యతిరేకం. సాధారణ పరిస్థితులలో మనం ఈపని చేయటానికి నేనుకూడా ఒప్పుకునేవాణ్ణికాదు. ఇటువంటి వ్యవహారాలలో మామూలుగాజరిగే పద్ధతి ఒకటేవుంది. మనం ఇప్పుడు ఆ పద్ధతిని అవలంబిస్తే, అవతల వాళ్ళకు మనమే ఒక అవకాశం ఇచ్చినట్లు అవుతుంది. ఇలాంటి విషయాల్లో అవతల వాళ్లు మనదగ్గిరకు వచ్చేవరకు వేచివుండటం మామూలుగా జరిగే పద్ధతి. కాని ఇప్పుడు మనం ఆ పద్ధతి అనుసరించకూడదు. మనం, ఇప్పుడే అంటే ఈరాత్రిగాని రేపుఉదయం గాని విచారణ సమయానికి ఆమెమీద ఫిర్యాదు చేయాలి. మనకు చేరిన కొన్ని వార్తలవల్ల డాక్టరు చంద్రశేఖర్ భార్య కోమలం, హత్యకు కారకురాలని మనకు అనుమానం కలుగుతూందని అందులో తెలియపరచాలి. ఆమే హంతకురాలనే బలీయమైన ఆరోపణం చేయటం, అందువల్ల వెంటనే నలభై ఎనిమిది గంటల్లో పోలీసువారు ఆమెను చెరసాలలో వుంచాలని కోరటం జరగాలి. ఇలాంటి పరిస్థితులలో పోలీసువారు ఆమెను ఖైదు చేయటానికి అంగీకరిస్తారు. ఎందుచేతనంటే, ఒక హత్యతో సంబంధంవుందని ఆరోపించే వ్యక్తి స్వేచ్ఛగావుంటే, అటువంటివాళ్ళు తమ సహచరులతో సంప్రదించటానికీ, నేరంనుంచి తప్పించుకోటానికీ అవకాశం వుంటుంది. అందుచేత ఆటువంటివాళ్ళని వెంటనే ఖైదుచేయటానికి పోలీసు అధికార్లు అనుమతిస్తారు. ఈ పని వెంటనే చేయండి. అటుతరువాత నామాటల్లోని లోకానుభవం మీకే తెలుస్తుంది. తరువాత తరువాత బయట పడే విషయాలు మీకే ఆశ్చర్యం కలిగిస్తవి."

"మనం ఏ కారణం ఆరోపించాలి?"

"ఏమీ లేదు. అభూతకల్పన చేయాలి."

"పాండ్యా! మనం అలాంటి అవ్యక్తపుపని చేయకూడదు. మన ఆరోపణ అసత్యమని రుజువయితే, అప్పుడు మన పరిస్థితి ఆలోచించావా? ఆమెను నిర్బంధించాలని పోలీసు అధికారులను కోరుతాం. పోలీసువాళ్లు ఆమెను జైలులో వుంచుతారు; కొడతారు. అయినా, ఆమెవల్ల ఏ విషయాలు మనకు తెలియవు. అప్పుడు ఆమె ఎదురుతిరిగి మన మీద పనువునష్టం దావావేస్తుంది. పంచాయతీ దారులు ఆమెకు అనుకూలంగా తీర్పు చెపుతారు. ఆలోచించు, మనం ఎలాంటి అగచాట్లకు గురికావలసి వస్తుందో! ప్రతి సంవత్సరం మనకంపెనీ ప్రకటనల ఖర్చుకింద లక్షరూపాయలు కేటాయించి వెచ్చిస్తున్నాము. అనాథలైన వితంతువులకు, మరణించిన వారి దిక్కులేని సంతతికి మనం ఆప్తమిత్రులమనీ, బంధువులమనీ, మనం చేస్తున్న సేవను గురించి పత్రికలలో ప్రకటిస్తున్నాము. మనం కష్టపడి సంపాదించిన ప్రతిష్ఠ ఏమౌతుందో కొంచం వూహించు! ఒక స్త్రీకి మనం న్యాయంగా చెల్లించవలసిన సొమ్ము ఇవ్వకుండా, ఆమె హంతకురాలని మనం ఆరోపణ చేస్తున్నామన్నమాట! తెలిసిందా?"

"న్యాయంగా మనం చెల్లించవలసిన సొమ్ము కాదిది."

"ఈ సొమ్ము మనం ఆమెకు న్యాయంగా చెల్లించవలసిందే, మనం వేరొకమార్గం తొక్కితే తప్పు."

"సరే, మీరు చెప్పేందీ నిజమే. కాని మనం ఇప్పుడు అనుసరించవలసిన పద్ధతి మామూలువిధానికి భిన్నమైనదని నేను ఇంతకుముందే చెప్పాను. నేను మీకు ఇప్పుడే చెపుతున్నాను. నా మాటలు విశ్వసించాలి. ఈపని చేసింది సామాన్యులుకారు. వాళ్లు ఒకరుగాని, ఇద్దరుగాని, ఇంకా ఎక్కువమందిగాని, వాళ్లు స్త్రీలుగాని, పురుషులుగాని అసాధ్యప్రకృతిగల మేధావులై వుండాలి. వాళ్లు ఈ పని మిక్కిలిసామర్థ్యంతో చేశారు. నేరం పట్టుపడకుండా, ఎటువంటి అనుమానాలకు స్థానం లేకుండా కార్యం ముగించారు. ఇక్కడ కూర్చుని హత్యకు కారణాలు ఆలోచించినంత మాత్రాన హంతకులు పట్టుపడరు. వాళ్ళని పట్టుకోటానికి వీలు లేకుండా పని జరిగిపోయింది. ఇప్పుడు మనం వాళ్ళని పట్టుకోటానికి ఒకటే మార్గం వుంది. అది వాళ్లకు ఎదురు వెళ్ళటమే! అది యుద్ధం కానీ, హత్య కానీ నాకు అనవసరం. వాళ్లకి ఆశ్చర్యం కలిగించటంఒక్కటే మన ఆయుధం. ఈఆయుధం మన పనిని పూర్తి చేస్తుంది. ఇదే మనకు మార్గం."

"పాండ్యా! నీవు చెప్పే విషయాల్ని అంగీకరించలేకుండా వున్నాను."

"ఎందుచేత?"

"ఈ సంగతి నీకు లక్షవిధాల చెప్పాను. ప్రతి భీమా కంపెనీ ఆర్తులపాలిటి కల్పవృక్షమని లక్షలాది ప్రజలకు చెపుతూంది. మనం మామూలుగా అనుసరించే విధానాన్నే ఇప్పుడు కూడా అవలంబించాలి. నీవు పెడత్రోవ పట్టించకూడదు. పోలీసు అధికారులకు మనవల్ల కావలసిన సహాయమేదైనా వుంటే, మనం చేద్దాము. వాళ్లు చేసే పరిశోధనలవల్ల మనకు అనుకూలపడే విషయాలు ఏమైనా వెల్లడి అయితే, ఆ అవకాశాన్ని వినియోగించుకుందాము. ఏవైనా అనుమానాలు మనకు వుంటే వాటిని వాళ్ళకు తెలియపరచవచ్చు. చట్టబద్ధమైన శాస్త్రవిహితమైన చర్యలు తీసుకుందాము. కాని నీవు చెపుతున్న పద్ధతి..."

మేనేజింగ్ డైరెక్టరు వాక్యం పూర్తి చేయకుండా ఆగి, పాండ్యా ముఖంలోకి చూశాడు. [ఇంకా ఉంది]

# చదువురాని సాధువు

ఆర్. వీరసామి.

చదువురాని మూఢుడొకడు
సాధువువేషం ధరించి,
జనుగుర్తి వహించి
ప్రబలసాగ పోయెగాను.

ఆతడొక మహాత్ముడౌ
నని తలంచి ప్రజలెల్లరు
అతిథ్యము లొసగి రతని
కతి శ్రద్ధాభక్తులతో.

ఒక దినమున విందొనర్చ
నొక ధనికుడు వాని పిలిచి,
సకలరుచ్య పదార్థముల
సమృద్ధిగా వడ్డించెను.

బాగ మెక్కి ఆరామం
తలప నతడు పండుకొనెన్
ఆ గృహస్థు వానిజేరి
యణకువగా నిట్టులనెను.

"ఇహ చింతలలో మునింగి
యిట్లు దుఃఖపడుచుంటిమి
మహాత్మ! గీత పుచ్చుకొని
మమ్ము కృతార్థుల జేయుము."

అదివఱకెన్నడా మాట
నతడు వినకపోవుటచే
అదియును ఒక పిండివంట
యని తలంచి యతడిట్లనె.

"ఇప్పటికే చాల తింటి
యింక కొంత సేపాగుము
తప్పక అదికూడా తిని
తరలిపోదు భయపడకుము."

అది విని యటజేరిన వా
రందరు గొల్లున నవ్విరి;
చదువురాని ఆ సాధువు
చాల సిగ్గుపడె పాపము!

# గొలుసు దొంగ

అక్క పెళ్ళిసందట్లో తనకు మరీ ప్రాముఖ్యం తగ్గిపోవడంవల్ల రాధకు ఊసుపోక అందర్నీ ఛరీ ఛీస్తూ యింటి వెనుక పంచలో కూర్చుంది. ఆ ఇంట్లో మామూలు రోజుల్లోనే రైతులూ చుట్టాలూ అందరూ సందడిగా వుండడం అలవాటు. అందులోకీ పెళ్ళి! కాఫీల గదిలో కొందరూ, వీధిగదిలో చతుర్ముఖపురాణం వాళ్లు కొందఱు, ఎవరి సందట్లో వాళ్లు నిమగ్నులై వున్నారు. "ఏంవమ్మా ఇక్కడ కూర్చున్నావు" అని అడిగింది పుల్లమ్మ. రాధ మాట్లాడలేదు. అసలు సమాధానం చెప్పదలచుకోలేదు. పుల్లమ్మత్తన్నా నర్సమ్మ అన్నా రాధకి అసహ్యం. వాళ్ళు తనని పలకరిస్తే మరీ కోపం. మూతి విరుచుకొని పుల్లమ్మ వెళ్ళిపోయింది. అలా రెండు నిమిషాలున్నదో యేమో "అన్నట్టు తమ్ముడేడీ" అనుకుంద రాధ. గబగబా యింట్లోకి వెళ్లింది. వీధిలోకి వచ్చింది. ఇంట్లోనూ వీధిలోనూ కనబడలేదు. గదులన్నీ వెదికింది. ఇంతట్లో సీత పిన్నిగారి రఘు చెప్పాడు. "ఇప్పుడే పుల్లమ్మత్త రమ్మన్నదనీ తమ్ముడు రానంటే బలవంతంగా యీడ్చుకెళ్ళిందనీ"ని. రాధ భయపడింది; పుల్లమ్మత్తా నర్సమ్మా కలసి తమ్ముణ్ణి ఏమైనా చేసేస్తారని. గబగబ పెరటివైపు నడిచింది. రాధకు ఒక్కసారి గుండె ఆగినంత పనయింది. తనూహించినట్టే ఇద్దరూ కలసి తమ్ముణ్ణి లాక్కుపోతున్నారు. నర్సమ్మ—తమ్ముడి చేతిలో బంతి లాక్కొని పంచలోకి విసిరేసింది. తమ్ముడు గట్టిగా ఏడవడం ఆరంభించాడు.

"ఎందుకురా అల్లా రాగాలుతీస్తావ్! ఊరల్లా వినాల్నా" అంటోంది పుల్లమ్మత్త "నీ బంతి ఎక్కడికీ పోదు. మా వెంటరా" అన్నది నర్సమ్మ.

"అన్నయ్య వాడుక్కి వచ్చినప్పుడూ అక్కయ్య నెంత యేడిపించావూ! తర్వాత అక్కయ్య చెప్పింది కూడాను—వీళ్లు వెళ్లిపోయే అప్పుడు వీశెన్నర బంగళా దుంపలూ పంచదారా కాఫీగుండా కట్టుకుపోయేర్ట!" "దొంగముండలు" మెల్లగా అనుకుంది రాధ. రాధకి మరోక భయం పట్టుకుంది. "తమ్ముడి మెళ్లో చైను తీసుకుంటారు కాబోలు" తమ్ముడేడుస్తున్నాడు "అమ్మా" అని. "ఎందుకురా అమ్మ. నువ్వెంత అరిచినా ఇప్పుడు రాదులే" అంది పుల్లమ్మ. తమ్ముడెంత యేడుస్తున్నా లక్ష్యం చెయ్యకుండా నూతి దగ్గరకు తీసుకుపోతున్నారు. రాధకు మతిపోయింది. గడ్డివామి పక్క నిలబడి వింటోంది. నర్సమ్మా పుల్లమ్మత్తా ఏవో గుసగుస లాడుకుంటున్నారు. "ఇప్పటికే ఆలస్యమైంది. ఆ మెళ్లో చైను తియ్యావే" అంది నర్సమ్మ. తీశారు కాబోలు! తమ్ముడు గట్టిగా ఏడ్వడం రాధకు వినిపించింది. "బట్టలిప్పెయ్యరా" అంది పుల్లమ్మత్త. రాధ కొంచెం తలయెత్తి చూసింది. పుల్లమ్మత్త అందించిన చైన్‌ని నర్సమ్మ కొంగుకు ముడి వేసుకుంది. తమ్ముణ్ణి నూతిగట్టు అవతలకు తీసుకువెళ్లారు. రాధకు గుండె జారిపోయింది.

అక్కడుంటే ఏం జరుగుతుందోనని ఇంట్లోకి పరుగెత్తి నాన్నగారి చెవిలో చెప్పింది. ఆయన ఉన్నపళంగా పరుగెత్తుకొచ్చారు. ఆయన వెంట చాలమంది వచ్చారు. నూతి వెనుక పుల్లమ్మత్తా నర్సమ్మా వంగి తమ్ముణ్ణి ఏదో చేస్తున్నారు. తమ్ముడు గట్టిగా "అమ్మా" అని ఏడుస్తున్నాడు. రాధా, వాళ్ల నాన్నా పరుగెత్తి వెళ్లారు. నర్సమ్మ తమ్ముడికి తలంటుతూంది. ఆ పక్కన బట్టలన్నీ పడివున్నాయి. "నరిరా నాయనా! అబ్బబ్బ తలంటి పోసుకోవడాని కెంత అల్లరి పెట్టావురా! హాయిగా ఒళ్ళు తుడుచుకొని, తల దువ్వుకొని, చైను వేసుకొని ఆడుకుందుకుగాని" అన్నది—నర్సమ్మ. రాధ నాన్నగారు ఫక్కున నవ్వారు. రాధ అమాయికంగా చూసింది. ★

# సొహారాబ్-టామ్

## రావిళ్ల కృష్ణారావు

చాలా కాలం క్రిందట టర్కీ దేశంలో సొహారాబ్ అను యువకు డుండేవాడు. చిన్నతనం లోనే సకల విద్యలు నేర్చి అక్కడి మహారాజు మన్ననల చూరగొన్నాడు. అందు కతనిని ప్రభుత్వ కార్యాలయాలమీద తనిఖీదారుగా నియమించారు.

సొహారాబ్ స్వతహాగా చాలా మంచివాడు. స్వామిభక్తిపరాయణుడు. సత్యనిరతుడు. తన విధ్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వర్తించేవాడు. అతడు స్వామిద్రోహు లనిన ఏమాత్రం సహించేవాడుకాదు. పైపెచ్చు అటువంటివారిని ఒకటిరెండు మారులు దయతలచి క్షమించి బుద్ధిగలిగి మెలగమని విడిచిపెట్టేవాడు. అందుచేత అతనంటే ఎక్కువ మందికి గిట్టేదికాదు.

ప్రభుత్వ ధనాన్ని విచ్చలవిడిగా యిచ్చవచ్చినట్టుల వ్యయపరిచే వారికి మితవ్యయాన్ని గురించి చెప్పి నీతి గరప జూచేవాడు. దొంగ లెఖ్ఖలు వ్రాసి ప్రభుత్వ ధనాన్ని అపహరింప జూచేవారిని దండిగా దండించేవాడు. అతనిచే దండింపబడినవారు, అవమానింపబడినవారు టర్కీలో చాలమంది అయిపోయ్యారు. అయినా సొహారాబ్ యదావిధిగా తనపని తాను చేసుకుపోతుండేవాడు.

సొహారాబ్ వద్ద టామ్అనే కుక్క ఒకటి వుండేది. టామ్ చాలా తెలివైనది. అది ప్రతి విషయాన్ని యిట్టే పసిగట్టేది. అడుగుజాడల ముట్టితో వాసనచూచి అపరాధుల పట్టి యిచ్చిన హంశాలెన్నో వున్నాయ్. సొహ్రారాబ్ దానిని ప్రాణప్రదంగా చూచేవాడు. ఆ కుక్కను తన ప్రక్కనే పడుకోబెట్టుకునేవాడు. తనే స్వయంగా దానికి అన్నం పెట్టేవాడు. అనేక క్లిష్ట సమయాల్లో అది సొహారాబ్ కమూల్యంగా తోడ్పడింది. అది నమ్మినబంటు సొహారాబ్ కు. తానెప్పుడు ఎక్కడికి వెళ్లినా దానిని తన వెంటనే తీసుకువెళ్లేవాడు. ఆ కుక్కను చంపవలెనని ఎంతమందో ఎన్నిసార్లో ప్లానులు వేశారు. కానీ బుద్ధికుశలుడైన సొహారాబ్ ముందా ప్లానులు ఫేలైపోయాయి.

ఒకనాడొక ఆదాయ-వ్యయ పట్టి



కల ప్రభుత్వ కార్యాలయాన్ని తనిఖీ చేశాడు సాహారాబ్. దొంగ లెఖ్ఖలు వ్రాసి దాదాపు పదివేల రూపాయలు ఆబ్యాంకు మేనేజరు కాజేసినట్లు నిరూపించాడు. కావలసిన వివరాలతో షరా రాసుకున్నాడు, మహారాజు సన్నిధిని అపరాధిని అపరాధిగా ఋజువు పరచుటకు. అప్పటికే మూడుసార్లు అతణ్ణి క్షమించినాడు. ఇక సహించలేకపోయాడు.

తను మూడుసార్లు మందలించి పోనీ పాపమని క్షమించి విడిచివేసినా అతడు తన నీచబుద్ధిని మానకుండుట సాహారాబ్ కు ఆగ్రహ కారణమైంది. ఆ కార్యాలయ మేనేజరు అతణ్ణి లాలూచీపరపజూచాడు. ఆఖరుకు పదివేలిస్తానన్నా "ఛీ! స్వామి ద్రోహి! నీలాంటి చీడపురుగులున్నంతకాలం ప్రజలు సుఖపడరు" అన్నాడు రౌద్రమూర్తియై. కోపంతో కొట్టుమిట్టాడుతున్న సాహారాబ్ కేసును గట్టిగా సిఫారసుచేశాడు దండనార్హుడని. ఈ దెబ్బతో మేనేజరుకు కఠిన శిక్షయే పడితీర్తుంది.

సాహారాబ్ మరికొన్ని పనులు చక్కబెట్టుకుని రాజధానికి ప్రయాణమయ్యాడు. రాజధాని సరిగ్గా పది మైళ్లు అక్కడికి. షుమారు నాలుగు మైళ్లు అరణ్యంలోనుండి విధిగా ప్రయాణం చేయాల్సిన ఆవశ్యకత వుంది. సాహారాబ్ "నమ్మిన బంటు"ను వెంటబెట్టుకుని బయలుదేరాడు. అతడామార్గం గుండా తన జాగిలనేస్తంతో నాలుగైదు సార్లు ప్రయాణంచేశాడు. అందుకే అతను భయపడకుండా సాయంత్రమైనా రాజధానీ నగరానికి బయలుదేరాడు. అయిదుమైళ్ల దూరం వచ్చేసరికి ప్రొద్దుకూకింది. మరో మైలుదూరం వెళ్లేసరికి బాగా చీకటి పడింది.

అంతా దుర్గమమైన అరణ్య ప్రాంతం. కన్ను పొడుచుకున్నా దారి కానరావటంలేదు. ముందు శునకరాజము వెనక వెనక సాహారాబ్ నడుస్తున్నారు.

చల్లనిగాలి వీస్తోంది. ఆకాశాన తెల్లని మబ్బుతునకలు నెమ్మదిగా కదులుతున్నాయి. నక్షత్రాలు మిణుగురు పురుగులకుమల్లే మిలమిలా మెరుస్తున్నాయి.

ఇద్దరూ బాట సాగిపోతున్నారు. ఇద్దరి మధ్యలో ఎడం, క్రమక్రమంగా ఒక ఫర్లాంగుదూరమైంది. కుక్క హుషారుగా నడుస్తున్నది. ఏదో ఆలోచిస్తూ మందగమనంతో ముందుకు సాగిపోతున్నాడు సాహారాబ్. కుక్క మూలమలుపు తిరిగింది.

బాట కిరుప్రక్కలా దట్టంగా పెరిగిన దేవదారు, ఫర్ వృక్షాలూ పొదలూ గుమ్మటాల్లా ఆ నిశా సమయంలో భయానకంగా వున్నాయ్. క్రిమికీటకాదుల ఝుమ్మనే శబ్దం దారిన పోయే వాళ్ళకు భయానకంగా కనపట్టుతోంది. ధీరహృదయుడైన సాహారాబ్ బాట సాగుతూనేవున్నాడు. ప్రక్కనేవున్న ఫర్ వృక్షము చాటు నుండి ఏవో నాల్గు నల్లని ముసుగు ఆకారాలు తనవైపే వస్తున్నట్లు తోచింది అతనికి. అవి క్రమంగా అతణ్ణి సమీపించాయి.

ఎన్నడూ చలించని మనసు ఒక్కసారిగా భయంతో నిండిపోయింది. నోట మాట పెగలటం లేదు. దగ్గర్లో టామీ కనుపించటం లేదు. ప్రయత్నించాడు టామీ అని పిలవాలని. కాని అతని ప్రయత్నం ఫలించలేదు.

నల్లముసుగు ఆకారాలతణ్ణి చుట్టేశాయి. ఒకడు గట్టిగా నోరు నొక్కాడు. మరొకడు బలంగా ఒక్క గ్రుద్దు గుద్దాడు. ఒకడు కాళ్లూ మరొకడు తలా పట్టి అరణ్యంలో కీడ్చుకు పోసాగారు.

బాటనడచే టామీకి గ్రుద్దు ధ్వని వినవచ్చింది. వెనుదిరిగి చూచింది. యజమాని రావటం లేదు. దాని కళ్లు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి. పిక్కబలంకొద్దీ అడవిలో అలికిడయ్యేవేపు పరుగు తీసింది.

తనస్వామిని నిర్బంధించి తీసుకు వెళ్లేవాళ్ళలో ఒకని చేతివ్రేళ్ళను నోటితో గట్టిగా లాగింది. పర్యవసానంగా చిటికెనవ్రేలూడివచ్చింది. మరికొందరిని కరచింది. గీరింది. సాహారాబ్ నక్కడే వదలివేసి వాళ్లు పారిపోయారు. వాళ్లను చాలా దూరం తరిమివేసి తిరిగి వచ్చింది టామీ. "స్వామి" నేలమీద పడి వున్నాడు. దుండగుల బలమైన గ్రుద్దుల కతని శరీరము అక్కడక్కడ కమిలింది.

తెల్లవారేవరకు సాహారాబ్ కు స్పృహ రాలేదు. ఎటూ పాలుపోక

---

## ఏ. వి. ఆర్. ఏ. రెమిస్సో,

27-2-57 తేదీ వారపత్రిక 54 వ పేజీలో పై స్నోలకు ఆంధ్ర స్టేటుకు సోల్ ఏజెంట్లు విజయ ఏజన్సీస్, పి బి నెం. 109, విజయవాడ-1 అని ప్రకటించినది పొరపాటు. పై కంపెనీ ఆంధ్ర ఏజెంట్లు మెసర్సు పి. ఆర్. ట్రేడ్ ఏజన్సీస్, విజయవాడ వారని సవరించి చదువుకోనేది—

# ★ సొహరాబ్ - టామీ ★

రాత్రంతా అతణ్ణి కాపాడుతూనే వుంది టామీ.

రాత్రంతా చలిలో పడి వున్నందువలన, కటిక నేలమీద బాధతో స్పృహతప్పి పడివున్నందున, స్పృహ వచ్చాక అతని బాధ వర్ణనాతీతంగా వుంది. టామీ అతణ్ణి విడిచిపోలేకపోతుంది. ఉండి ఆయన బాధను చూడలేకపోతుంది. ఏమయినా యజమానిని అది విడిచి పోదలచలేదు. బాధగా మూలిగే సొహరాబ్‌ను చూచి అది కంటికి కడివెడు నీరొంపింది. బాట నెవరైనా వెళ్లతారేమోనని పరికించింది. అలాంటి జాడ ఏమీ కానరాలేదు టామీకి. హృదయ సంక్షోభంతో ఇరువురూ అలాగే వుండిపోయారు.

ఝాము ప్రొద్దెక్కింది. కుక్క సహాయంకోసం వేచి చూస్తూంది. అల్లంత దూరాన బాటమీదగా ఎవరో పోతున్నట్టు పసిగట్టింది టామీ. భౌభౌ మని జాలి గొలిపే స్వరంతో గట్టిగా మొరిగింది టామీ. దారినిపోయే పాంథుని కర్ణపుటాలదాకా సోకిందా జాలి గొలిపే ఆక్రందనం.

అతడు ఆవేపుగా నడిచాడు. పరిస్థితి నంతా చూచాడు. సొహరాబ్ అతనికి తెలుసు. కానీ సొహరాబ్ కతనెవరో తెలియదు. ఇంకా మూడుమైళ్లుంది రాజధానీ నగరం. ఆ ప్రాంతమంతా గాలించగా ఒక చిటికెనవ్రేలూ మరి కొన్ని కాగితాలూ దొరికాయి. సొహరాబ్ నతడు రాజధానీ నగరం చేర్చాడు పదుగురు సాయంతో మధ్య మధ్యన.

పదిరోజులు రాజవైద్యులతనికి ప్రత్యేకంగా చికిత్సచేశారు. తత్ఫలితంగా సొహరాబ్ సంపూర్ణారోగ్యవంతుడైనాడు.

మహారాజు చిటికెనవ్రేలెవరిదోనని చాలావరకు గాలించాడు. ఎక్కడా దాని జాడ తెలియలేదు. తెలిస్తే దొంగ దొరికినట్లే.

టామీయే తన్ను రక్షించినాదని తనకు తెలిసినంతవర కూహించి చెప్పాడు సొహరాబ్ మహారాజుకు. తన్నెవ్వరట్లా నిర్బంధించిందీ పోల్చలేనని, కనీసం టామీ మూలమలుపు తిరక్కపోతే యీ అవాంతరం జరక్కపోయేదనీ, జరిగినా ఒకడైనా సులువుగా చిక్కేవాడనీ- అయినా చివరకు టామీయే తన్ను రక్షించిందని చెప్పేశాడు సొహరాబ్. చావుతప్పి కన్ను లొట్టపోయినందులకు సంతసించారంతా.

ఒకనాడు టామీతో రాజవీథిని బయలుదేరాడు సొహరాబ్. బజారు నేదో సరుకు తీసుకుని తిరిగి వస్తూండగా టామీ ఒక షాపులో బేరమాడే పెద్దమనిషి మీదికి కురికింది. అతని చేయిని కరచి పట్టుకుని సొహరాబ్ దగ్గిరికి తీసుకొచ్చింది. దగ్గరికి వచ్చాక కుక్క చేతిని విడిచిపెట్టి కుయ్ కుయ్ మని అతణ్ణి కరవబోయింది. సొహరాబ్ గ్రహించాడు. అతని కుడిచేతి చిటికెనవ్రేలు లేదు. అతడు ప్రభుత్వ ఆదాయ వ్యయ కార్యాలయపు మేనేజరు. తనను లాలూచీపరప జూచినవాడు.

పురవీథుల్లో గస్తీ తిరిగే సిపాయి కేకేసినాడు సొహరాబ్. సిగ్గుతో తల వంచుకునివున్న "పెద్దమనిషి"ని బంధించి రాజ సన్నిధికి గొంపోయారు. మహారాజు రాజవైద్యులచే ఆ చిటికెనవ్రేలు అతనిదో కాదో పరీక్ష చేయించాడు. ఆ చిటికెనవ్రేలు అతనిదే.

అతనికి కఠినశిక్ష పడింది. ★

# సినిమా

## "ఏ రాయి విసిరినా..."

బాక్సాఫీస్ సూత్రాలు ఏమేమిటి అని తర్కించుకొని, జాబితా వేసుకొని, వాటి ప్రకారం నవరసభరితమూ, సహస్రాధిక సమస్యాపూరితమూ, నిషాదమయమూ, వినోదప్రధానమూ ఇంకా ఫలానా ఫలానమూ అయినవిధంగా ఒక చిత్రాన్ని తీర్చిదిద్దేసరికి ఆ చిత్రం ఐదుమైళ్ళపొడుగు తేలింది

ఇంత పెద్ద చిత్రం చూస్తారా జనం అని మనం ఆలోచించాలి అన్నాడు రచయిత.

మనం ఇందులో చెప్పిన సంగతేమిటో



కళ్యాణి పిక్చర్స్‌వారి "అక్కా-చెల్లెళ్లు"లో కృష్ణకుమారి.

**సి... ని... మా**

**కొత్తగా విడుదల అయిన తెలుగు చిత్రం చూచి వస్తున్న ఒక ఆసామిని, మిత్రుడొకడు పలకరించి "ఎలా ఉంది సినిమా ?" అన్నాడు.**

**"ఇంకా అలాగే ఉంది..."** అన్నాడు ప్రేక్షకుడు.

"కథేమిటి? దేన్ని గురించి?"

"బోల్డు కథలున్నాయి అందులో. ఇంక సందేశాలు సరే సరి; ఎవర్నీ మోసం చెయ్యొద్దని, అబద్ధం ఆడితే గిట్టుబాటు కాదనీ, ఇలాటివే ఏవో... మామూలువే" అన్నాడు ప్రేక్షకుడు ఎటో చూస్తూ ఏదో ఆలోచిస్తూ...

కూడా ముందే తెల్సుకోవాలి అన్నాడు నిర్మాత

ఏహా కేమిటి భోరెత్తున్నాయి సంగతులు ఏ రాయి తగిలినా హిట్టే అన్నాడు దర్శకుడు.

అయితే అన్ని రాళ్ళూ ఒకసారే వేసే బదులు, ఈ చిత్రాన్ని మైలుంబాతిక చొప్పున మూడు ముక్కలు చేసి, సీరియల్ గా విడుదలచేస్తే డబ్బు గారంటీగదా అన్నాడు అక్కడే ఉన్న ఒక మిత్రుడు నవ్వుతూ

ఇది కట్టుకథ కోవలోనిది కాదు. పరిశ్రమలో పదికాలాలపాటు తిరిగి పరిస్థితులు, తీరుతెన్నులూ ఆకళించుకున్న ఒక ఆసామీ విసుకెత్తి అన్నమాటలు ఇవి. హాటం వేళాకోళంగానే ఉన్నా ఊహ మంచిదే అనిపిస్తుంది

హీనపక్షం 18 వేల అడుగులు పొడుగు ఉండేలాగ, కనీసం డజను సమస్యలకి తక్కువ కాకుండేలాగ, డజను పాటలూ, అరడజను డాన్సులూ ఖరారుగా ప్రవేశపెడుతూ "సర్వాంగ సుందర"మైన చిత్రాలు నిర్మించే దక్షిణభారత చలనచిత్రపరిశ్రమలో ఈ పద్ధతి ప్రవేశపెడితే అభ్యంతరం గా ఉంటుందనిపిస్తుంది సీరియల్ చిత్రాలు కాకపోయినా, జంటచిత్రాలు విడుదల చేయవచ్చు చెప్పదలచుకొన్న సంగతిని చక్కగా, సూటిగా, మనసుకు హత్తుకు నేలా చెబుతూ కళని, కథని, రచయితని గౌరవిస్తూ



సారథివారి "పెద్దరికాలు" చిత్రంలో ఆర్. వి. కృష్ణారావు, గుమ్మడి, పెరుమాళ్లు.

# "ఏరాయి విసిరినా..."

తగినంత నిడివిలో (పదివేలకు మించకు) చక్కని చిత్రం తీయవచ్చు.

ఇక మిగతా బాక్సాఫీస్ హంగులు – నిష్ప్రయోజకాలయిన వివాదాలూ, కథలో చోటులేని నృత్యాలూ, గీతాలూ, అసలు కథకన్న ఎక్కువ ప్రాధాన్యం వహించే హాస్య గాథ ప్రేమగాథ వాపతువన్నీ మరో ఐదారు వేల అడుగులలో ఇంకో చిత్రంగా తీసి అసలు చిత్రానికి జోడించి, "గొప్ప డబుల్ ప్రోగ్రాం" అని గొప్పగా ప్రచారం చేసి మరీ జనాన్ని పిలవచ్చు ఉభయ తారకమైన ఏర్పాటు

నిజానికీ పద్ధతి కొత్తకాదు. హాలీవుడ్ నించి వచ్చే చిత్రాలు పూర్వం ఇదేపద్ధతిలో ఉండేవి ఒక చిన్న చిత్రం, ఒక డాక్యుమెంటరీ, ఇత్యాది ఏర్పాట్లు ఇంటర్వెల్ వరకూ, అసలు చిత్రం ఆ తరవాతాను (ఇప్పుడు వారూ 'తెలుగు' మార్గం పోతున్నారు)

ఇక, నేటి మననిర్మాతలూ "ఇలా విడదీస్తే ఎలా" అని మథనపడ నవసరం లేదు

ఈనాటి మనచిత్రాలు దాదాపు అన్నీ "నవరసభరితంగా" ఉంటూనే ఉన్నాయి. దర్శకుడూ రచయితా ఎంతగా తంటాలుపడి టంకాలువేసినా, చిత్రంలో అంశాలు "తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం" వతుగానే ఉంటున్నాయి

అందుచేత అవి రెండూ విడదీసి విడిగానే చూపిస్తే వచ్చిపడే ప్రమాదం ఏమీ ఉండదు చిన్నచిత్రాల నిర్మాణం క్రమంగా వృద్ధి అయి దారినపడడానికి దోహదం జరుగుతుంది అప్పుడు, ప్రధానచిత్రాల నిర్మాణ వ్యయం తగ్గుతుంది

వీటికి జోడాలుగా తీసే చిన్న చిత్రాలద్వారా కొత్త నటీనటులకూ, రచయితలకూ, దర్శకులకూ టెక్నిషియన్లకూ కూడా అవకాశాలుఇచ్చి, సమర్థులను సుశిక్షితులను తయారుచేయడానికి అవకాశం ఉంటుంది

నానాటికీ పెరుగుతున్న మన పరిశ్రమకు కొత్తమార్గాలూ మార్గాంతరాలూ అవసరం మంచికథ నేమందర ఏరితీసుకొన్నా, దానికి సినిమా "చికిత్స" (ట్రీట్‌మెంట్) చేసి, నవరసాలూ, అప్పుడే సమస్యా చూపించే సరికి అది మళ్ళీ నిర్జీవమైన, పాతరకం సినిమా కథగానే తయారయిపోతుంది ప్రతి చిత్రం దేశానికిచ్చే సందేశాలు కోకొల్లలుగా, వాచకపుస్తకాలలో నీతివాక్యాలలా నిర్బలంగా, నిరుపయోగంగా ఉంటున్నాయి సమస్యని సమగ్రంగా చిత్రించకపోయినా, పరిష్కారమార్గాలుమటుకు, తప్పనిసరి అన్న ధోరణిలో, మొక్కుతీర్చుకున్నట్టు చూపించడంమీద ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నారు దీనివల్ల ఇటు పరిష్కారమూ లేదు అటు సమస్య స్వరూపాన్ని అయినా, ప్రజల దృష్టికి తెచ్చి గట్టిగా తెలియచెప్పడమూ లేదు. పోతే వీటిమూలంగా అసలు కథని అల్లకల్లోలం చేసివేసి పరిపరివిధాల పరుగుపెత్తించడంమాత్రం జరుగుతోంది

 

# సినిమా వార్తలు



విజయా వారి "మాయాబజార్" చిత్రాన్ని ఉగాదికి కానుకగా సమర్పిస్తున్నారు

శ్రీ కె. వి. రెడ్డి దర్శకత్వాన తయారయిన ఈ చిత్రంలో సావిత్రి, నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, ముక్కామల కృష్ణమూర్తి, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, ఆర్. నాగేశ్వరరావు, మిక్కిలినేని, చదలవాడ కుటుంబరావు, వంగర వెంకటసుబ్బయ్య, బాలకృష్ణ, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, సంధ్య, ఋష్యేంద్రమణి, ఛాయాదేవి మొదలగువారు పాల్గొన్నారు

సంగీత దర్శకుడు ఘంటసాల వెంకటేశ్వరరావు ఛాయాగ్రహణం మార్కస్ బార్ట్లే. కళ. గోఖలే, కళాధర్

* * *

## భట్టి విక్రమార్క

పి. వి. వి. ఎస్. ఎం. (పోలిశెట్టి వీర వెంకట సత్యనారాయణ మూర్తి) ప్రొడక్షన్ వారి "భట్టి విక్రమార్క" చిత్రాన్ని ఈ నెల 2 న వాహినీలో పాటల రికార్డింగ్ ప్రారంభించారు. సుశీల, మాధవపెద్ది సత్యం, కోమల పాడారు సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వర రావు.

---

ఏదో వోరాయితగిలితే చాలన్న దృష్టితో తయారుచేసే ఈ చిత్రాలు, ఏరాయీ తగలని సందర్భాలలో పూర్తిగా దెబ్బతినిపోతున్నాయి. జనం కనతగ్గ, వినతగ్గ అంశాలు కూడా అలాగే వృధాఅవుతున్నాయి

ఈ నాటి చిత్రనిర్మాణానికి మనవారు పట్టిస్తున్న ఈ పద్ధతులు, ఈ సూత్రాలూ పదిహేను ఇరవై ఏళ్ళనాటివే - అప్పటికీ, ఇప్పటికీ తేడా కనబడదు నాటికీ నేటికీ మనం బాల్యావస్థలోనే వున్నామనిపిస్తుంది

ఈ స్థితిదాటి, చిన్న చిత్రాల ద్వారా కొత్తపంథాలు అవలంబించడానికి దక్షత గలవారూ, సామర్థ్యంవున్నవారూ మొదట ఉపక్రమించి దారితీయాలి కొద్దిగా డబ్బు తెచ్చుకొని, మిగతాది డిస్ట్రిబ్యూటర్ దగ్గర తీసుకొని చిత్రం తీయబోయే కొత్త నిర్మాతలు ఒక్కసారిగా విఫణివీధిలో సాహసాలు చేయలేరు గట్టిగా నిలద్రొక్కుకుని, మంచిపేరు తెచుకున్న సంస్థలే దారితీయాలి అటువంటివారు చేసే తొలిప్రయత్నాలు తప్పక విజయవంతం అవుతాయి



ఎన్. టి. రామారావు, అంజలి, గుమ్మడి, రేలంగి మొదలగువారు పాల్గొనే ఈ చిత్రానికి దర్శకత్వం, ఛాయాగ్రహణం కూడా బి. ఎన్. రెడ్డి నిర్వహిస్తున్నారు కథ, మాటలూ పరశురాం (నాగులచవితి) వ్రాస్తున్నారు నృత్య దర్శకుడు వెంపటిసత్యం.

వీరు ఈ నెల 11 న వాహినీలోనే మొదటి సెట్ పై షూటింగు కూడా ప్రారంభించారు.

## సతీ అనసూయ

రాజశ్రీ ("జయం మనదే") ప్రొడక్షన్స వారు ఈసారి పౌరాణికం నిర్మిస్తున్నారు

అంజలి, జమున, జానకి, గుమ్మడి, రేలంగి, ముక్కామల మొదలగువారితో తయారు కానున్న ఈ చిత్రం "సతీ అనసూయ"

చిత్రపు నారాయణమూర్తి దర్శకత్వం నిర్వహిస్తున్నారు రచన సముద్రాల జూనియర్ సంగీత దర్శకుడు ఘంటసాల

## దొంగలున్నారు జాగ్రత్త!

ప్రతిభా వారి కొత్తచిత్రం "దొంగలున్నారు జాగ్రత్త" బి. ఎన్. ఆర్. దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది రచన ఆత్రేయ జి. వరలక్ష్మి, గిరిజ, జగ్గయ్య, గుమ్మడి, రాజనాల రమణారెడ్డి, సి. ఎస్. ఆర్, బాలకృష్ణ, చదలవాడ, శివర్రావు ప్రభృతులు నటిస్తున్నారు. ఛాయాగ్రహణ దర్శకుడు ప్రకాష్

## "ఆడపెత్తనం"

ప్రభా ప్రొడక్షన్స్ వారి సాంఘిక చిత్రం "ఆడపెత్తనం" నవ దర్శకుడు ఆదుర్తి (తోటికోడళ్ళు) సుబ్బారావు దర్శకత్వాన కొనసాగుతోంది. అంజలి, అమ్మాజీ, నాగేశ్వరరావు, రేలంగి, గుమ్మడి, రమణారెడ్డి నటిస్తున్నారు కథ, మాటలూ, పాటలూ పినిశెట్టి శ్రీరామమూర్తి వ్రాస్తున్నారు.

## వేగుచుక్క

జూబిలీ ఫిలింస్ వారి "వేగుచుక్క" చిత్రం ("మర్మవీరన్" తెలుగుప్రతి) ఈ నెల 16 న విడుదల అవుతుంది వైజయంతిమాల



"ప్యాసా" లో గురుదత్, మాలాసిన్హా.



ప్రతిభావారి క్రొత్తచిత్రం "దొంగలున్నారు జాగ్రత్త"లో క్రొత్తవేషంలో జి. వరలక్ష్మి, రాజనాల.

## సినిమా వార్తలు

రాజసులోచన ఎం. ఎస్. రాజం, శ్రీరాం నాగయ్య, బాలయ్య, తంగవేలు, చంద్రబాబు, మొదలగువారు నటించారు.

## 'టౌన్ బస్'

డబ్ చేసిన చిత్రాలలో విజయవంతంగా సాగుతున్న చిత్రం జైరాం ప్రొడక్షన్స్ వారి "టౌన్ బస్" అంజలి ఇందులో ముఖ్య భూమిక నిర్వహించింది. మాటలు పాటలూ వైరాగి వ్రాశారు. డబ్బింగ్‌ను జగన్నాథ్ నిర్వహించారు

## బలే బావ

ధనసాయి ఫిలింస్ వారి హాస్యరసచిత్రం "బలే బావ" త్వరలోనే విడుదల కాబోతుంది

సబ్బులీస్ ("వదినెగారి గాజులు") రజనీకాంత్ దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో జానకి, జగ్గయ్య, రేలంగి, సి. యస్. ఆర్., గుమ్మడి నటిస్తున్నారు. రచన కొండముది గోపాలరాయశర్మ, అని సెట్టి సంగీత దర్శకుడు సుసర్ల దక్షిణామూర్తి ఛాయాగ్రహణం సి. నాగేశ్వరరావు నిర్మాత టి. రంగయ్య.



తెలుగు భాషాసమితి నిర్వహించిన గ్రంథ రచన పోటీలో 1954-55 కు ఉత్తమ గ్రంథంగా ఎన్నిక అయిన "నాటక కళ" రచయిత శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి ఈ గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రు. 500 బహుమతి ఇస్తున్నారు.

## "సతీ సులోచన"

కమలా పిక్చర్స్ అనే క్రొత్త సంస్థ ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది వీరు "సతీ సులోచన" అనే పౌరాణిక చిత్రం నిర్మించ బూనుకొన్నారు నిర్మాత శ్రీ వడ్డి చంటిబాబు. ఈచిత్రానికి రచయిత తాపీ ధర్మారావు

## సౌత్ ఇండియన్ ఫిలిం డైరెక్టరీ

"సౌత్ ఇండియన్ ఫిలిం డైరెక్టరీ' 1957 సంచిక మా కార్యాలయానికి చేరింది దక్షిణ భారత చలనచిత్ర నటీనటుల, దర్శకుల, తదితర కళాకారుల జీవితచరిత్రలను సంగ్రహంగా ఇందులో పొందుపరచారు. ఛాయా చిత్రాలు కూడా పుష్కలంగా ఉన్నాయి.

దక్షిణ భారతంలోని చలనచిత్ర నిర్మాణ సంస్థల వివరాలు, స్టుడియోల వివరాలు సిబ్బందిపేర్లు, చిరునామాలూ, సెన్సార్ నిబంధనావళి కూడా వివరంగా సమకూర్చారు సంపాదకుడు శ్రీ సురభి దుర్గారావు క్రౌను సైజు 250 పేజీలు వెల మూడు రూపాయలు, పోస్టేజి ముప్పావలా ప్రతులకు ఎస్. కల్యాణరామ్ & కో., 69, కోడంబాకం హైరోడ్, మద్రాసు 17 అని వ్రాయాలి

* * *

# అదీ - ఇదీ

అంతర్జాతీయ స్థాయిలో ప్రదర్శనకు యోగ్యత, అవకాశం త్వరగా సంపాదించడం మన చలనచిత్ర పరిశ్రమ మనుగడకు, పురోభివృద్ధికి చాలా అవసరం అని బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఎస్ కె పాటిల్ మొన్న బొంబాయిలో మాట్లాడుతూ అన్నారు.

ప్రపంచ విపణిలో చోటు సంపాదించక పోతే భవిష్యత్తు ఏమంత మహోజ్వలంగా ఉంటుందనిపించదని ఆయన తెల్పారు.

ఈమాట అక్షరాలా నిజమేనన్న నిజం అహోరతం రేపు ఉదయానికల్లా ఋజువు కాకపోయినా కొంతకాలం గడిచేసరికి త్రోసిరాజనరాని విషయం కావడం తథ్యం. నిన్నటికన్న నేటి పరిశ్రమ పరిమాణం పెరిగింది ధరలూ, వాటివల్ల ఖర్చులు పెరిగాయి. కాని మార్కెట్ మాత్రం తగినంతగా పెరగలేదు.

ప్రాంతీయ భాషా చిత్రం ప్రతీదీ ఇప్పుడు కనీసం రెండు భాషలలో తయారవుతోంది లేదా, కొంత అటూ ఇటూగా డబ్ చేస్తున్నారు. కొందరు అఖిల భారత స్థాయిలో ప్రదర్శనకు ప్రయత్నిస్తున్నారు.

బొంబాయి పరిశ్రమలో వారు అంతర్జాతీయ ప్రదర్శనకే ప్రయత్నిస్తున్నారు.

మన చిత్రాలు అంతర్జాతీయ విపణిలో చోటు సంపాదించాలంటే, నేటి పద్ధతులలో చాలా మార్పులు రావాలి. వ్యాపార దృష్ట్యా ప్రధానమైన వాటిలో నిడివి ఒకటి. మనవారు ఇతర శాఖలలో ఉన్నత ప్రమాణాలు అందుకోవడానికి ప్రయత్నించి ఫలితాలు సాధిస్తున్నా, చిన్న చిత్రాలను చక్కగా, మితిదాటకుండా నిర్మించడంలో మటుకు గట్టి ప్రయత్నాలు చేయటం లేదు.

ఉన్నంతలో బొంబాయి నిర్మాతలు మెరుగే అయినా, మద్రాసులో ఇంకా పదారు వేలకి తక్కువగా ఉన్న చిత్రం ఏదీ లేదు.



గౌతమి ఫిలిమ్సువారి "వేగుచుక్క"లో స్టంటు సోము, శ్రీరాం.

## భవానీ జంక్షన్

జాన్‌మాస్టర్స్ అనే బ్రిటిష్ ఆసామి వ్రాసిన నవలని అడ్డుపెట్టుకొని హాలీవుడ్ కంపెనీ మెట్రోగోల్డ్విన్ మేయర్ "భవానీ జంక్షన్" అనే చిత్రాన్ని నిర్మించింది. ఇందులో వారు, భారత స్వాతంత్ర్య సమరాన్ని హాలీవుడ్డీయ పథాన, సినిమాటిక్‌గా చెప్పడానికి ఒడిగట్టారు.

"ఈపని ఈగడ్డమీద సాగడానికి వల్లకాదని" భారత ప్రభుత్వం స్పష్టంగా చెప్పింది (అప్పుడు పాకిస్తాన్ ప్రభుత్వం వారికి సదుపాయాలు చేసింది) ప్రధాని నెహ్రూ ప్రభృతులంకూడా పార్లమెంటులో ఈ చిత్రం విషయం, ఈ నవల విషయం ప్రస్తావనకు వచ్చిన సందర్భంలో నిరసన వెలిబుచ్చారు.

అటు ఆంగ్లేయులతోగాని, ఇటు భారతీయులతోగాని చేరలేక మథనపడిన ఒక ఆంగ్లోఇండియన్ యువతి ఇందులో నాయిక. ఈరూపేణా, "ఒక వర్గం భారతీయుల వైఖరి"ని చెప్పబోయారు. ఇలాగే ఇంకా బోల్డు ఊహలు ఉన్నట్టు కనబడుతుంది.

ఇలా మన దేశం వచ్చినవాళ్ళే ప్రతివిదేశీయుడికీ గోచరించే లోటేసి నగ్న సత్యాలు మామూలుగా పుస్తక రూపంలోనూ, దరిమిలా చలన చిత్ర రూపంలోనూ ప్రచురితం కావడం, ప్రచారితం కావడం జరిగిపోతే

ఈ రంగుల హంగుల తెరమీద "భవానీ జంక్షన్" దర్శకుడు భారతదేశ స్వరూపం పట్లకన్న అవా గార్డ్నర్ రూపాన్ని చూపించడం పట్ల, స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన సత్యాలకన్న సినిమాకి పనికొచ్చే 'నగ్న సత్యాల'ను ప్రదర్శించడం పట్ల ఎక్కువ శ్రద్ధ వహించారు.

ఇక, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని — శాంతియుత సత్యాగ్రహాన్ని, వీరు చిత్రించినవిధం చూస్తే హేళనచేయాలన్న దుసంకల్పం కొట్టొచ్చినట్టు కనబడుతుంది. కాంగ్రెసు సత్యాగ్రహ దళనాయకుడిని హాస్యగాడుగా చూపించారు. అతడి తరహా అంతా ఇందుకు గట్టి నిదర్శనం.

పోతే అహింసాయుత ఉద్యమచరిత్రలో, హాలీవుడ్ చూపిన కొత్తకోణం ప్రకారం, బ్రిటిష్‌వాళ్ళే బంగారుతండ్రులు కాం



కమలా పిక్చర్స్ అనే కొత్తకంపెనీకి ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది.



కాశీనాథ్ ప్రొడక్షన్స్ వారి "రామాంజనేయ యుద్ధం"లో అమర్‌నాథ్, రఘురామయ్య

## అదీ - ఇదీ

గ్రామ సత్యాగ్రహాలకన్న, ఈ బ్రిటిష్‌వారికే అహింసఅంటే ఎక్కువ అభిమానం

"తుపాకులూ అవీ పేలుస్తారు స్మండీ వెళ్ళిపోండి" అని చెప్పడంమటుకే వారు చేసినపని!

సత్యాగ్రహాలు ఎవరికైనా దెబ్బలుతగిలినా, ఏం అఘాయిత్యం జరిగినా అదంతా "ప్రజలూ — లేక గూండాలు" చేసిన పని మాత్రమేనట! బ్రిటిష్‌వాళ్ళు చెయ్యెత్తిన పాపాన పోలేదన్నమాట! ఈ విధంగా చరిత్రను, సత్యాన్నీ చిత్రించచ్చినట్టు మార్చేసుకుని, డబ్బు చేసుకోడానికీ, కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికి పనికొచ్చే విధంగా దీన్ని తీర్చిదిద్దారు ఇందులో కమ్యూనిస్టు నాయకులు కేవలం హాలీవుడ్ క్రైమ్ పిక్చర్లలో "గాంగ్‌స్టర్"ల బాపతుగా, సౌలభ్యం, చాకచక్యం ఉట్టిపడేలా దారుణాలుచేసేస్తూ ఉంటారు వాళ్ళపద్ధతిలో రైళ్ళను ఆపెయ్యడం, వాటిలో ఎక్కి అఘాయిత్యాలుచేయడం సాగిస్తారు ఇదీ వరస.

మిత్రదేశాల గౌరవప్రతిష్ఠలను చిన్నచూపుచూసే పద్ధతిలో తీసిన విదేశీయ చిత్రాలను భారతప్రభుత్వం నిషేధిస్తున్నదన్న విషయం విదితమే (ఈ పద్ధతిప్రకారం నిషేధించబడ్డ చిత్రాలలో "ఆఫ్రికన్ క్వీన్" ఒకటి) ఇలాగ మిత్రదేశాలపట్ల, ఆయా జాతీయులపట్ల గౌరవభావాన్ని ప్రదర్శించిన మనప్రభుత్వం ఇప్పుడు మనదేశాన్ని, మన జాతిని అడ్డుపెట్టుకుని మనస్వాతంత్ర్యోద్యమాన్ని ప్రచారానికీ, ధనార్జనకీ వాడుకుంటూ, మనల్ని హేళనచేస్తూ ఎం జి ఎం. నిర్మించిన ఈ చిత్రాన్ని ఈ దేశంలో ఎలా ప్రదర్శించనిస్తున్నదన్న విషయం దురూహ్యం. ★

## ప్రేమే దైవం

ఆర్ ఎస్ ఆర్ (నాగేంద్రరావు) పిక్చర్స్ వారి చిత్రం "ప్రేమే దైవం" విడుదలకు సిద్ధంగా ఉంది ఈ నెలాఖరులోగా, తప్పితే ఏప్రిల్‌లో విడుదల చేస్తారని తెలుస్తోంది

శ్రీరంజని, సూర్యకళ, సంధ్య, చలం, గుమ్మడి, రాజనాల, ఆర్. నాగేంద్రరావు నటించారు దర్శకుడు నాగేంద్రరావుగారే రచన జి కృష్ణమూర్తి సంగీతం హెచ్ ఆర్ పద్మనాభశాస్త్రి ★

## 'ఫిలింఫేర్' బహుమతులు

1956 లో విడుదల అయిన హిందీ చిత్రాలలో ఉత్తమచిత్రాన్నీ, నటీనటులను, ఇతర కళాకారులనూ ఎన్నికచేసి గౌరవించడానికి "ఫిలింఫేర్" పత్రిక ఏర్పాటుచేసిన నిర్ణాయకసంఘం పరితల అభిప్రాయాలు పరిశీలించి, ఆయా చిత్రాలనుచూచి, బహుమతులకు అర్హులను నిర్ణయించింది

ఈ నిర్ణయాలు అన్నీ ఏకగ్రీవంగా జరిగాయి

ఉత్తమ చిత్రం ఝనక్ ఝనక్ పాయల్ బాజే

ఉత్తమ దర్శకుడు వి శాంతారాం.

ఉత్తమ నటుడు దిలీప్‌కుమార్ ("దేవదాసు" భూమికకు)

నటి — నూతన్‌సమర్థ్ ("సీమా" చిత్రం)

సహాయనటుడు మోతీలాల్ ("దేవదాసు")

సహాయనటి వైజయంతిమాల ("దేవదాసు")

ఉత్తమమైన (చలనచిత్ర) కథ.—"సీమా" (రచయిత అమియచక్రవర్తి)

సంగీత దర్శకులు శంకర్, జైకిషన్ ("చోరీ చోరీ")

ఛాయాగ్రహణం రాధూ కర్మాకర్ ("శ్రీ 420")

శబ్దగ్రహణం ఎ. పి పార్కర్ ("ఝనక్ ఝనక్ పాయల్ బాజే").

కూర్పు జి జి మాయేకర్ ("శ్రీ 420")

కళా దర్శకత్వం కానూ దేశాయ్ ("ఝనక్ ఝనక్ పాయల్ బాజే")

"ఝనక్ ఝనక్ పాయల్ బాజే" చిత్రానికి మొత్తం నాలుగు బహుమతులు, "దేవదాస్" (బిమల్ రాయ్)కు మూడు బహుమతులు, "సీమ" (అమియ చక్రవర్తి,) "శ్రీ 420" (రాజ్ కపూర్) లకు రెండేసి బహుమతులూ లభించాయి ★

# ★ ఆవుపాలు మంచివి ★

(36-వ పేజీ తరువాయి)

దగ్గర శేరు ఒక్కంటికి రూపాయ పుచ్చు కుంటాడు. అనుభవంతోనే చెపుతోన్నాను అటువంటిపాలు పోస్తే పిల్లలకు జబ్బు చెయ్యదా మరి? స్వచ్ఛమైన ఆవుపాలు, చెరి సగం నీళ్లు కలిపి, మితంగా పడితే సాధారణంగా పిల్లలందరికీ అరుగుతాయి. పుష్టి చేస్తాయి.

## ఆవు నెయ్యి

కొంతమంది పిల్లలు ఏడాది వెళ్ళినా కూడా నడవలేరు. అటువంటి పిల్లలకి ఆవు నెయ్యి బాగా ఉపయోగిస్తుంది. కల్తీలేని ఆవు నెయ్యిలో చల్లటి మంచినీళ్లుపోసి నూరుసార్లు కడగాలి, లెఖ్ఖ తప్పకుండా నూరుసార్లూ మాత్రం కడగటం చాలా ముఖ్యం. అల్లా కడిగిన నేతిముద్ద తెల్లగా అయింటుమెంటులా వుంటుంది, నీటి చుక్కలు లేకుండా చూచి వెడల్పుమూతి సీసాలో జాగ్రత్త పెట్టుకొని రోజూ ఉదయం సాయంకాలం నడకరాని పిల్లలకాళ్లకు మర్దన చేసినయెడల 40 రోజులలో నడవ గలిగెదరు. మర్దనచేసిన ఒక గంట తరువాత వేడినీళ్లుపెట్టి కడగవచ్చును. 12 నెలలు పిల్లలు మొదలు 5 సంవత్సరాల పిల్లలు వరకూ కూడా మర్దన బాగా ఉపయోగపడు తుంది. ఇది నా అనుభవమువలన చెప్తున్నాను. ఆవుపాలు, ఆవు నెయ్యి వంటివస్తువులు లేవు. మంచిబలాన్ని చేకూరుస్తాయి.

పోచర్ల సుబ్బలక్ష్మి, (భీమవరం). ★

# ★ పారిపోయిన దొంగ ★

(40-వ పేజీ తరువాయి)

అందుచేతనే వాటిని తీసి అవతల పడవేసి వుంటారన్న విషయం తేలిపోయింది. కాబట్టి కాంతం బ్రతికే వుండాలి అని నిశ్చయించుకున్నాను. అయితే ఎవరిదా యాడశవం? మగశవం కిష్టయ్యదేనా? - ఈ ప్రశ్నలికి జవాబులు లభించలేదు.

"ఆలోచించుకుంటూ తిన్నగా కిష్టయ్య ఇంటివేపు నడిచాను. సీతారామయ్యని విచారించగా ఆ సాయంత్రమే కిష్టయ్య వొంటి కాలిమీదనుంచుని, సీతారామయ్య చేత ఇంటిని తాకట్టు పెట్టించి, కోర్టుకోసం వెయ్యిరూపాయలు తెప్పించాడని తెలిసింది. కిష్టయ్యకి కోర్టుమీద ఇంతకాలంగాలేని శ్రద్ధ ఆ సాయంత్రమే ఎలా పుట్టుకొచ్చింది? ఇందులో ఏదో మోసం ఉంటుందని గ్రహించాను. వెతుకుతోండగా కిష్టయ్య పడుకునే మంచంమీద దిండుకింద, ఎవరో కిష్టయ్యని బ్లాక్ మెయిల్ చెయ్యడానికి రాసిన ఉత్తరం దొరికింది. ఉత్తరానికుపయోగించిన ఎక్సర్ సైజు నోటుబుక్కులోని కాయితం, రాత అవీ చూడగానే, ఉత్తరం ఎవరో స్కూలు కుర్రాళ్ళు రాసివుంటారని ఊహించాను. స్కూలుమాస్టర్లని విచారిస్తే తెలియవచ్చని, అనుకుంటూ స్టేషను చేరుకున్నాను. స్టేషన్ చేరుకోగానే సబ్ జెయిలునుండి రంగడు తప్పించుకుపోయాడని తెలిసింది. రంగడే యీపని చేసివుంటాడని ఏడుకొండలనుకున్నాడు. కాని నేను నమ్మలేదు. ఎందువల్లనంటే రంగడుదొంగ. శవం చేతిలో వుంగరాన్ని వదిలేస్తాడా? పైగా ఆ వుంగరం కిష్టయ్యని గుర్తుపట్టేందుకు ఉపయోగపడుతుందని రంగడికి తెలుసు.

"నేను ఆలోచించుకుంటూ హైస్కూలువేపు సైకిల్ని పోనిచ్చాను. దార్లో రహదారి బంగళా ముందు, మర్రిచెట్టు వేపు చూచాను. చెట్టుక్రింద జబ్బులో తీసుకుంటోన్న బిచ్చగత్తె కనిపించలేదు. చింకిగోనె మట్టిమూకుడు మాత్రం కనిపించింది. వెంటనే సైకిలుదిగి అక్కడ పక్కన విచారించాను. ఆ సాయంత్రం చచ్చిపోయిందనీ, మునిసిపాలిటీవాళ్ళు లాగేసివుంటారనీ చెప్పారు. నాకు నమ్మకం కుదర్లేదు. మునిసిపాలిటీ వాళ్లు లాగేసివుంటే చింకిగోనెనీ, మట్టిమూకుణ్ని లాగేసి వుండేవాళ్లు. అందుచేత వెంటనే మునిసిపాలిటీ ఆఫీసుకెళ్ళి విచారించాను. ఆ శవాన్ని తాము ముట్టలేదనీ, ఊరివాళ్ళే ఎవరో లాగేసివుంటారనీ చెప్పారు. ఇటు, మునిసిపాలిటీవాళ్ళుకానీ, అటు, వూరివాళ్ళుకానీ ముట్టుకోని శవం ఏమైంది? కాంతింట్లో కాలిపోయిన ఆడశవం ఎవరోరి తేలిపోయింది.

"తరువాత తిన్నగా స్కూలుకెళ్లి ప్రయత్నించాను. ఓ మాస్టారు ఆ కాయితంలోని అక్షరాల్ని గుర్తుబట్టి, దాన్ని రాసినకుర్రాణ్ణి తీసుకొచ్చాడు. ఆ కుర్రాణ్ని విచారించగా ఆ వుత్తరం రాసింది తానే అనీ, కిళ్లీకొట్టు కిష్టయ్యే అలా చెప్పి, తనచేత రాయించాడనీ తెలిసింది. కిష్టయ్య ఎందుకిలాంటి ఉత్తరాన్ని సృష్టించాడు? ఆ వుత్తరాన్ని చూచినవాళ్లు ఎవరో తన్ను బ్లాక్ మెయిల్ చెయ్యజూచారనీ, తాను లొంగక పోయ్యేసరికి, వాళ్లే యీ ప్రమాదాన్ని సృష్టించి, తన యింట్లోని నగల్నీ డబ్బునీ దోచుకుపోయారనీ పొరబడేందుకే ఈ పని చేసివుంటాడని అర్థమైపోయింది. దాంతో కిష్టయ్య చావలేదనీ, ఈ నాటకమంతా కాంతా, కిష్టయ్యా కలిసి ఆడారనీ దృఢమైపోయింది.

"అయితే ఆ మగశవం ఎవరిది? ఆలోచించాను. ఆ మూడోరోజే రంగడు సబ్ జెయిల్లోంచి తప్పించుకుని తిన్నగా కాంతిల్లు చేరుకుని ఉంటాడనీ తనతో వొచ్చెయ్యమని కాంతని తొందరపెట్టి ఉంటాడనీ, కాంతా కిష్టయ్యా ఇద్దరూ కలిసి ఆలోచించి, రంగిణ్ణి తమ కడ్డులేకుండా చేసుకునేందుకు యీ నాటకం ఆడి వుంటారనీ శవం రంగడిదే అయివుంటుందనీ ఊహించాను. కాంత సారా కాయడంలో దిట్ట. కాంతెక్కడుంటే అక్కడ సారాబట్టీ వెలుస్తుంది. అందుకనే యీ చుట్టుపక్కలెక్కడేనా సారాబట్టీ వెలుస్తుందేమో కనిపెట్టి వుండమన్నాను."

"ఏంవింటీ?" ఏడుకొండలూ, రహీమూ ఇద్దరూ ఆశ్చర్యంగా గుడ్లెల్లబెట్టారు.

తెల్లవారింది. నాయుడు కుర్చీలో కూచుని రిపోర్టు తయారుచేస్తున్నాడు.

"సార్ సార్. రాత్రి అడగడం మరిచాను సార్. మరే, మరి, ఆ కోట్లోవున్న సన్యాసెవడు సార్?" అని అడిగాడు ఏడుకొండలు.

నాయుడు సన్నగా నవ్వి "వాడు పరుగెత్తేప్పుడు జోల్లోంచి కిందపడ్డ పుస్తకాన్ని బాగా చూచుంటే నన్నడగాలిసిన అవసరమే ఉండేదికాదు" అంటూ టేబుల్ డ్రాయర్లోంచి పుస్తకాన్ని తీసి టేబుల్ మీద పడేశాడు.

ఏడుకొండలు కాయితాన్ని తిరగేసి "కాటన్ నంబర్లు సార్ కాటన్ నంబర్లు" అని ఎగిరి గంతేశాడు.

"ఇప్పుడర్థమైందికదూ, వాడెవడో?"

"అయింది సార్ అయింది. కాటన్ నంబర్లు రాసే సన్యాసి సార్."

"ఏడిసినట్టే వుంది."

ఏడుకొండలు నిజంగానే ఏడుపుముఖం పెట్టాడు.

"ఫోర్-నాట్-త్రీ."

"హాజర్ సార్."

"ఆ సన్యాసిగాణ్ని లాక్కురా."

అబ్దుల్ రహీం, సన్యాసిని అక్కడికి లాక్కొచ్చాడు.

"అతగాడి గడ్డం లాగెయ్."

అబ్దుల్ రహీం, ఎగిరి అమాంతం, అతగాడి గడ్డం లంకించుకున్నాడు. గడ్డం తనంతటవే చేతికి ఊడొచ్చింది.

"అరే ఇస్కీ, రౌడీరంగడి తమ్మూ, కేడి నర్సిగాడూ చే" అని ఆశ్చర్యంగా ఎగిరి గంతేశాడు.

"వాడు రౌడీ రంగడి తమ్ముడు కాబట్టే వేషంలోవుంటే రంగడని మీరు పొరబడ్డారు. నేనూ పప్పులో కాలేయబోయాను. ఇంతలో నర్సిగాడుకోసం వెళ్లిన ఆశీర్వాదం వొచ్చి నర్సిగాడింట్లో లేడని చెప్పేసరికి తన్నెక్కడ పోల్చేస్తారోనని నర్సిగాడు ఉలికిపడ్డాడు. వంటనే పోల్చేశాను. ఊళ్లో కాటన్ నంబర్లు రాయించడంలో నర్సిగాడిది పెద్దచెయ్యి. మారువేషంలో వెళ్ళి నంబర్లు రాయిస్తే తన్నెవరూ గుర్తించరని నర్సిగాడీ ప్లాను వేశాడు. ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

**Regd. No. M. 4479.** Andhra Patrika Illustrated Weekly

వహీదా రెహ్మాన్ ఎల్లప్పుడూ

# లక్స్ టాయ్‌లెట్ సబ్బును

ఉపయోగించును. "అది ఎంత తెల్లనిదో అంత శుద్ధమైనది"




**సినీమా తారలు తమ చర్మమును మనోహరముగాను, మృదువుగాను ఉంచుకొను విషయమందు అధికమైన శ్రద్ధ వహించవలెను. ప్రవీణురాలైన భరత నాట్య నర్తకి మరియు పురోవృద్ధి గాంచుచున్న సినీమా తార, వహీదా రెహ్మాన్, తన చర్మమును మృదువుగాను, పరిమళముగాను, ఉంచుకొనుటకు లక్స్ టాయ్‌లెట్ సబ్బునే ఉపయోగించును.**

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

* గురుదత్ గారి "ప్యాసా" చిత్రంలో సినీమా తార

LTS 491-X52 TL